# స్వప్నం

[ భాసరూపకములలో రెండు అనుసరణముల సంపుటి ]



భమిడిపాటి కామేశ్వరరావు

పబ్లిషర్సు:
కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి

వెల
రూపాయి

# హెచ్చరిక

కేవలం వినోదం నిమిత్తమైనా సరే లేక సొమ్ము వసూలు చేసుకొనేనిమిత్తమైనా సరే, ఈ ప్రదర్శనాలలో ఏదైనా సభఎదట ఆడదలచిన ప్రతిసంఘంవారున్నూ ముందుగానే గ్రంథకర్తకి వ్రాసి లిఖితానుమతి పొందకపోవడం, కాపీరైట్ చట ప్రకారం ఒకనేరం గనక, ఆ సంగతి గమనించి లిఖితానుమతి పొంది తరవాతనే ఆడుకోవాలి.

భమిడిపాటి కామేశ్వరరావు
రాజమండ్రి



[illegible]
రాజమండ్రి

మొదటి ముద్రణ
1953

# భాసుడు

భాసుడు (క్రీస్తుపూర్వము 350 నాటి) ప్రాచీన ప్రముఖ ప్రశస్త ప్రసన్న సంస్కృత నాటకకర్త. కాళిదాసు అతణ్ణి స్మరించాడు. నాటకాలు పన్నెండు పై చిలుకు ఉన్నా, ఎవళ్లో వాటిని అణిచే అన్నట్టు అవి నలభైయేళ్ళక్రితం దాకా నామావశిష్టంగా ఉండిపోడం బహుశా అతని పురాణ నాటకాలలో, అతడు పురాణలిఖితం కాని సంగతులూ పురాణ విరుద్ధం అయిన విశేషాంశాలూ జొనిపి స్వాతంత్ర్యం చూపించడంవల్లనేమో, అతని రచన అంతకాలం మరుగున పడిఉండడం! ఏమైతేం గనక, ఎప్పుడో ఒకప్పుడు అవి దొరికిఉండడం ప్రపంచనాటక సారస్వతంయొక్క అదృష్టం. నవీనులు కనిపెట్టిన ఏకాంకికలు అతనికి తెలిసినట్టు కనిపిస్తుంది. అతడు పెద్ద కథ పట్టుగుని అదంతా నాటకీస్తూ కూచోడు. ఆ కథలో నాటకం ఎక్కడుందో చూపిస్తాడు. కొద్దిమాటలతో అతడు పాత్రలకి జీవం పొయ్యడమే కాదు. వ్యక్తిత్వం కూడా ప్రసాదించగల స్రష్ట. ఏపాత్ర ఎప్పుడు ఏమాట ఎంతవరకు ఏరీతిగా అనాలో అనిపించగల ఔచిత్యం అతని సొమ్ము. దేవుడంటివాడికి అతడు మచ్చ చూపించగలడు. రాక్షసికి హృదయం ఉందని నిరూపించగలడు. ప్రతి పాత్రనీ అతడు ప్రేమించే చిత్రించాడు. మానవప్రకృతి చిత్రణం హడావిడిలో అనుగుణంగా ప్రకృతిని వర్ణించడం అతడు మరవలేదు. పండితకవిప్రకాండులు భాసరూపకాల్ని ఆంధ్రంలోకి అనువదించారు. అసంపూర్తిగా నిల్చిపోయిన 'చారుదత్తం' తప్ప తక్కిన పన్నెండింటినీ ఆచరణకి అనుకూలించేలాగున మార్చి నేను ప్రకటించడంలో 'మధ్యముడు' అనే సంపుటంలో అయిదు, 'బాలకేసరి' అనే సంపుటంలో మూడు, 'ప్రతిమ' అనే సంపుటంలో రెండు, 'స్వప్నం' అనే సంపుటంలో రెండు వీటి గమనింపగలరు.

ఈ సందర్భంలో, మద్రాసు హైకోర్టు న్యాయమూర్తులలో ఒకరైన గా॥ ఎ. యస్. పి. అయ్యర్ యం. ఏ., ఐ. సి. యస్. బార్-ఎట్-లా రచించిన "హైందవ సారస్వతుల పరంపర - భాసుడు" అనే ఆంగ్ల గద్య గ్రంథం కూడా నాకుతోడ్పడింది. వారికి నా కృతజ్ఞతాపూర్వకవందనాలు.

అనుసరణకర్త.

# ప్రతిజ్ఞ

(నాలుగు రంగాల రూపకం)

## పాత్రలు

| | |
|---|---|
| యౌగంధరాయణుడు | (మంత్రి - పిచ్చివాడు) |
| రుమణ్వంతుడు | (మంత్రి-బౌద్ధసేనాని) |
| వసంతకుడు | (విదూషకుడు-ముష్టివాడు-గాత్రసేవకుడు) |
| హంసకుడు | (అంగరక్షకుడు) |
| విజయ | (ద్వారపాలకి) |
| మహాసేనుడు | (రాజు) |
| బాదరాయణుడు | (కంచుకి) |
| భరతరోహకుడు | (మంత్రి) |
| అంగారవతి | (రాణి) |
| ఒక యోధుడు | |

## రంగాల పేర్లు

1 వత్సరాజు చెఱ
2 వాసవదత్త పెళ్ళిమాటలు
3 రెండో యెత్తు
4 అంతా తాగడమే

## రంగం—వచ్చే పాత్రలు

1 యా, వి, హం
2 బా, మ, అం,
3 యా, వ, ఱ,
4 యా, వ, యో, భ, బా

## పాత్ర—వచ్చే రంగాలు

యా—1, 3, 4
ఱ—3
వ—3, 4
హం—1
వి—1
మ—2
బా—2, 4
భ—4
యో—4
అం—2

## రంగం-1

[ఉదయనరాజు రాజధాని కౌశాంబి. రాజగృహంలో ఆలోచనాగారం వేదిక—దానిమీద పీఠాలు. ఒకచోట కాగితాలు. ఎ. మ. నించి యౌగంధరాయణుడు ఆలోచిస్తూ ఒక కాగితం చేత్తోపట్టుగుని ప్రవేశిస్తాడు].

యౌగ—అయ్యో, ప్రభూ! ఉదయనరాజా! ఏనుగుల్ని సాధించి పట్టడమనే వెర్రిఅభీష్టం మీకెందుకు పుట్టిందో కదా! ఆ అభీష్టమే మీకు లోపంగా పరిణమించి మిమ్మల్ని శత్రువుల మధ్యకి లాక్కుపోతోంది. మీ యీ లోపం కనిపెట్టి మహాసేనుడు మిమ్మల్ని పట్టదలిచాడు.

ఆ ప్రద్యోత మహాసేనుడిసేన అపరిమితం. కాని, అతడి సేనా భాగాలకి ఏకలక్ష్యం కుదరదు. అందులో మహాశూరులున్నారు. కాని వాళ్ళకి రాజభక్తి తక్కువ. అందువల్ల, వాళ్ళు యుద్ధంలో ప్రయోజన శూన్యులు—పతిభక్తి లేని సతులు పతులకి సంసారంలో ప్రయోజన శూన్యలైనట్టు! కాని ఎట్లా అయితేం మహాసేనుడు పక్కరాజుల్నందర్నీ జయించాడు మమ్మల్నితప్ప. ప్రభుభక్తిలేని తన సేనతో మా మీదికి దండెత్తి రావడానికి అతడికి గుండెలులేక, ఇప్పుడు ఎత్తువేశాడు. గర్భంలో యోధుల్ని దాచడానికి వీలైన ఒక కృత్రిమ నీలగజాన్ని నిర్మించాడు (అని తన చేతులో ఉన్న కాగితం చూస్తాడు).

ఊఁ (అని, తలపంకించి) వింధ్యపర్వతాలలో నాగవనం వెతికాడు. నమ్మిక పుట్టించడానికి అసలు ఏనుగుల్ని కూడా అక్కడ పోగుచేశాడు.

(కాగితం చూస్తూ) ఉదయనరాజు కీచకాటవిలో ఉన్నాడు. దానికీ నాగవనానికీ మధ్య మూడు అడవులు ఉన్నాయి రాజు కీచకాటవి వదిలిపెట్టి ముందుకి సాగక పూర్వమే వార్త పంపించాలి. ఆయన నాగవనంలో అడుగు పెట్టడమే జరిగితే, పట్టుబడడం తప్పదు. వాయువేగంతో వెళ్ళే వార్తాహరుణ్ణి పంపాలి.

విజయా ! విజయా !

వి—(ఎ. ఎ. నించి ప్రవేశిస్తూ) స్వామీ !

యౌ—రాజమాత ఏదో ఉత్తరం ఇస్తామన్నారు ప్రభువు వారికి ! తీసుకురా. శ్రీవారికి గ్రహబాధలు తొలగించడానికి తోరం ఒకటి కూడా ఇస్తామన్నారు. తే !

వి—చిత్తం స్వామీ ! తోరం కూడా సిద్ధం అయింది. కాని దాని ప్రభావం హెచ్చడానికి దాన్ని వివాహితల కంఠాలకి తాకించి వాళ్ళ ఆసీస్సుల్తో తేవడంలో ఆలస్యం అవుతోంది.

యౌ—వ్యవధి లేదు, విజయా ! వాళ్ళ ఆసీస్సులు లేక పోయినా సరే పెంద్రాళే తీసుకురా !

వి—చిత్తం స్వామీ ! అని ఎ. ఎ. కి వెళ్ళబోతూ కు. ఎ. కి చూసి అటు వెళ్ళి వచ్చి) ప్రభువువారి అంగరక్షక ప్రధాని హంసకుడు వచ్చారు.

యౌ—రమ్మను.

వి—(కు. ఎ. కి వెళ్ళివచ్చి, గబా గబా ఎ. ఎ. కి వెడుతుంది)

హం—(కు. ఎ. నించి వస్తూ) వందనం, అమాత్యా!

యౌ—హంసకా! రండి. కూర్చోండి. ప్రభువు క్షేమమా!

హం—క్షేమమే కాని............

యౌ—ఊరుకున్నారేం? నాగవనం ప్రవేశించారా?

హం—చిత్తం, ఖైదీ అయినారు కుడానూ!

యౌ—అయ్యో! ప్రభువువారి దురవస్థా! మోసపోయాంగదా! ఇప్పుడింక ఎవర్నీ అక్కడికి పంపక్కర్లేదు. హంసకా! ఆశ లేశమైనా ఉందా, లేక నా ప్రాణం త్యజించెయ్యనా?

హం—రాజు సజీవులేకదా! ఆశ లేకేం?

యౌ—కీచకాటవిలో గదా ఉన్నారు!

హం—అవును. ఉదయాన్ని ఇసక రేవున నర్మదదాటి మదగంధిర పర్వతం ఎక్కి అక్కణ్ణించి, ఏనుగుల మంద చూశాం. అవి సగం ఎండిన చెరువులో బురద చిమ్ముకుంటూ సగం ఎత్తువరకూ పెట్టిన రాతిగోడలా కనిపించాయి.

యౌ—వాటివల్ల బాధలేదే!

హం—లేదు. కాని ఎవడో చారుడు వచ్చి, మరొక దిశలో కోసుదూరంలో సాలవృక్షాల సందున మల్లె లతల మధ్య దంతాలూ గోళ్ళూ మాత్రం తెల్లగా ఉన్న నీలగజాన్ని చూసినట్టు వార్త తెచ్చాడు.

యా—ఇంకే ముందీ! తను గ్రంథాల్లో చదివిన నీల కువలయతనువు! అదే అని మన ప్రభువు పొంగి పోయుంటారు.

హం—నిజమే అమాత్యశేఖరా! ఆచారుడికి వంద కాసులు ఇచ్చారు. తన వీణతీసి గెళ్ళి దాన్ని బంధించి తను తెచ్చే వరకూ మమ్మల్ని చెరువులోనిమందని చూస్తూ అక్కడే ఉండగల ఆజ్ఞయిచ్చి ఒక్కరూ బయల్దేరారు!

యా—రుమణ్వంతుడు?

హం—ఆమంత్రి రాజుని వారించాలని యత్నించారు. ప్రభువు అష్టదిగ్గజాల్లో దేన్నైనాసరే పట్టగల సామర్థ్యంగల వారైనా, ఆ సరిహద్దుమండలాలవాళ్ళు పాలనకి లొంగని నీచజాతులవడంచేత, ఒంటరిగా వెళ్ళడం శ్రేయస్కరంకాదని చెప్పి చూశారు.

యా—రుమణ్వంతుడు అంతటితో ఊరుకున్నాడా?

హం—ఏంజేస్తాడు, అమాత్యా! ఎవరేనా కూడా వస్తే తనమీదే ఒట్టని ప్రభువువారు అందరి నోరూ మూసేశారు.

యా—నడిచే వెళ్ళారా ఒక్కరూ?

హం—లేదు. సుందరపాటలం అనే అశ్వాన్ని ఎక్కి మిట్టమధ్యాహ్నానికి పూర్వమే మాలో ఇరవై మందితో కదిలారు.

యా—మీరంతా చూశారా ఆ కృత్రిమగజాన్ని ?

హం—దాని శరీరవర్ణం సాలవృక్షపత్రాల రంగుతో ఏకీభవించడంవల్ల సూర్యరశ్మిలో దాని తెల్లటి దంతాలు మాత్రం నిరాధారంగా ఉంటూన్నట్టు కనిపించాయే కాని, ఇదమిత్థం అని ఆకృత్రిమ గజం కనపడలేదు.

యా—తన వీణ పుచ్చుగుని, ప్రభువు ఒక్కరూ దాని వైపు వెళ్ళారా ?

హం—చిత్తం. అదీ వారివైపు ఎదురు వచ్చింది. పైనుండే మావటీల వల్ల కాక, గర్భంలో ఉన్న యోధుల చేత అది నడపబడుతోందని మాకు బోధపడింది, వెనకాల్నుంచికూడా మాకు గోల వినపడింది.

యా—అయ్యో ! మీ యిరవైమందినీ శత్రుయోధులు చుట్టుముట్టేశారా ?

హం—చిత్తం. శత్రుయోధుల సంఖ్య పెరిగినకొద్దీ ప్రభువువారి శౌర్యమూ పెరిగిపోయింది. సూర్యుడు అస్తమించే వేళకి అంతా పడిపోయి, నేనుమాత్రం మిగిలిఉండగా, ఆయన మూర్ఛిల్లి పడిపోయారు !

యా—అయ్యో ! నేను జీవించి ఉండడం వ్యర్థం అయిందే ! ఆయన్ని వాళ్ళిప్పుడు హింసించలేరు కదా !

హం—తమ యిష్టం వచ్చినట్టు తూలనాడి పారేశారు. మామూలు వాణ్ణిలాగ బంధించారు. పక్కపొదల్లో ఏ మోటుతీగెలు దొరికితే వాటితో కట్టేశారు. వాళ్ళ దుండగాలు పూర్తి అయితేగాని రాజు తేరుకోలేదు.

యా—అప్పుడు వాళ్ళు ప్రభువుకి దూరంగా జరిగి ఉంటారే?

హం—చెల్లా చెదరై పోయారు. తమ క్షేమానికి భంగం లేని దూరాన్ని నిలబడి, 'నా సోదరుణ్ణి చంపేశాడు, నా తండ్రిని హతమార్చాడు, నా సుతుణ్ణి పొట్టని పెట్టుగున్నాడు, నా హితుణ్ణి కాజేశాడు' అంటూ మొదలెట్టారు. 'నువ్వెళ్ళి చంపు' అంటే 'నువ్వెళ్ళి చంపు' అంటూ ధైర్యం చాలక వంతులు పోయారు.

యా—ఆ దుస్థితిలో ప్రభువు ప్రాణాలు తియ్యడానికి ఎవడూ యత్నించలేదుకద!

హం—ఒకడు యత్నించాడు, అమాత్యా! అదే చిత్రం! రేగిన జుట్టు పట్టుగుని మన ప్రభువుని ఈడ్చి దక్షిణాభి ముఖంగా పారేసి కత్తిపట్టుగుని వెనక్కి నడిచి అక్కణ్ణించి పరుగులో వస్తూ ఊతంగా కొట్టా లనుకుని రక్తసిక్తమైన చోటు గనక కాలుజారి తన కత్తిమీద తనే పడ్డాడు.

యా—ప్రభువుకి అంత గండం గడిచిందా! అయితే నాకు ఏదో ఆశ పుడుతోంది.

హం—మన ప్రభువు పొడిచిన బల్లెంపోటుతో మూర్ఛిల్లి అప్పుడే తేరుకున్న సాలంకాయనుడు, మహాసేన మంత్రి, వచ్చి రాజుమీద అత్యాచారం ఆపేశాడు.

యౌ—అరే! చిత్రంగా ఉందే!

హం—ఆ మంత్రి మన ప్రభువుకి నమస్కరించి, వారి శృంఖలాలు తీసేసి, స్వారికి వీలియ్యని గాయాలతో వారు ఉండడంవల్ల, పల్లకిలో వారిని ఉంచి, సమస్త సదుపాయాలూ చూస్తూ, సానుభూతితో ఉజ్జయిని చేర్చారు.

యౌ—ఎవర్ని ప్రభువు శత్రువుల్నించి రక్షించారో, వారే ఇప్పుడు ప్రభువుని కష్టకాలంలో కాపాడారు. కాని, అంత తీవిగల రాజు, అంత మన్నన పొందే రాజు, ఆ పిరికిపందల ఎత్తిపొడుపులు భరిస్తూ క్రోధం అణుచుకుని ఎట్లా ఉండగలిగారో! గలరో! ఖైదీని వంచించినా ఖైదీకి వంచనే, గౌరవించినా, ఖైదీకి వంచనే!

[ఎ. ఎ. నించి విజయ వస్తుంది]

వి—(ఎ. ఎ. నించి వస్తూ) స్వామీ! ఇదుగో ఉత్తరం. ఇదుగో తోరం.

యౌ—ఇప్పుడు తోరం వ్యర్థం, విజయా! అది అవతల పారెయ్. యుద్ధం ముగిసిం తరవాత, యుద్ధరంగం మీదికి గుఱ్ఱం వెళ్ళడానికి దీపం ఎంతో, ఇప్పుడు ఆ తోరం అంతే.

వి—చిత్తం. రాజమాతగారికి ఏమిటి చెప్పడం?

యౌ—ఇల్లా యిల్లా అయిందని.

వి—ఎల్లా యెల్లా అయింది, అమాత్య శేఖరా !

యౌ—(ఊరుకుంటాడు.)

వి—(బాధతో) ప్రభువువారు క్షేమమేకదా, అమాత్యా! చెప్పండి.

యౌ—క్షేమమే. కాని, ఒంటినిండా దెబ్బలతో ఉజ్జయినీ నగరంలో మహాసేనరాజు అధీనంలో ఖైదీగా ఉన్నారు.

వి—అయ్యో! దురవస్థ! ఇది రాజమాతతో ఎట్లా చెప్పడం అమాత్యా !

యౌ—నేర్పుతో! నువ్వు ముందు గుండె రాయి చేసుగో. మెల్లిగా యథారీతిగానే వెళ్ళు. యుద్ధప్రసంగం తీసుగురా. రాజులికి అవి తప్పవను. యుద్ధంలో జయాపజయాలు దైవాధీనాలూ ఇద్దరూ నెగ్గడానికి వీల్లేదూ మొదలైన పాతసరుకు ప్రయోగించు.

వి—ఒకవేళ ప్రభువుకి ప్రాణాపాయం వచ్చిందేమోకదా అని ఆవిడ భయపడేటప్పుడు.

యౌ—వారిని బందీగా తీసుగువెళ్లారు, ఆయన క్షేమమే. ఆయన్ని గౌరవిస్తూనే ఉన్నారు. అని చెప్పి ఆవిడహృదయం పగిలిపోకుండా కాపాడు.

వి—(ఎ. ఎ. కి వెడుతుంది) చిత్తం.

యౌ—హంసకా! మీరెల్లా బయటపడ్డారూ!

హం——బయల్దేరిన గందరగోళంలో నావేషంమార్చి హతుడైన శత్రుయోధుడి వేషం ధరించి వచ్చేశాను.

యౌ—ప్రభువుతో ఉజ్జయిని వెళ్ళకపోయారా?

హం——ఇక్కడికి వెళ్ళి సంగతి చెప్పవలసిందిగా నన్ను సాలంకాయన మంత్రి కోరాడు.

యౌ——ప్రభువు నాతో చెప్పదలచినదేమీ చెప్పలేదా?

హం——వారు ఎంతో చెప్పదలిచినట్టు ఆందోళన కనపరిచారు. చివరికి, కళ్ళనీళ్ళుతిరగగా, వెళ్ళి యౌగంధరాయణుణ్ణిచూడు——అన్నారు.

యౌ——ఔరా! అట్లా అనిఉంటారని నాకు తెలుసు. నామీదవారికంత అభిప్రాయం, అయినా, ఆమాటలఅర్థం నేనుసరియైన ముందుజాగ్రత పడలేదనికదా! అవును. వారి సొమ్ముతిని వారికేమీ పనికిరాకపోయాను. వారు నా యెడల చూపించిన గౌరవమర్యాదలుపొంది ఊరుకుండిపోయాను — సరే. మరి నడుంకడతాను. అరణ్యంలోనో చెరసాలలోనో ప్రభువునికలిపి వారిమన్నన పొందుతాను. మహాసేనుడిమీద పై యెత్తువేస్తాను. అదికొనసాగకపోతే ప్రాణంఅర్పించేస్తాను. (వినడం అభినయించి) అరుగో స్త్రీలు ఏడుస్తున్నారు. వాళ్ళ ఏడుపులు ప్రభువువారి ఆపత్తూ మంత్రులవారి అప్రయోజకత్వమూ చాటుతున్నాయి.

వి——(ప్ర. ప్ర. వించివచ్చి, తలవంచి నిలబడి) వందనం, అమాత్యా!

యౌ—రాజమాత ఏమన్నారూ ?

వి—ఇవి వారి మాటలు. స్నేహితులుండీ కూడా ధీరుడైన వత్సరాజు ఇల్లాంటి ఘోర దుస్థితికి వచ్చాడు. ఈ దారుణాన్ని ప్రతిఘటించడానికి ఏమిటి చెయ్యడం ? వత్సరాజు స్నేహితుల్ని ప్రార్థించి వ్యాపారం తిన్నపరచాలి. యౌగంధరాయణా మీరు చాలా జ్ఞానులు. ప్రతికూల పరిస్థితుల్లో నిరాశపడడంగాని, కష్టసమయాల్లో ధైర్యం విడిచి నిశ్చేష్టులవడంగాని, శత్రువు ఎత్తువేసినప్పుడు తెల్లపోవడంగాని, అపజయం చేకూరిందని ఆత్మహత్య చేసుగోడంగాని, మీరు ఒప్పరు. ఒక్కమాట మీతో అంటున్నాను ! మీరు మొదట వత్సరాజు స్నేహితులు, తరవాతే కదా అతడి మంత్రులవుతా ! అందువల్ల మీరూ నా కుమారులే! కనుక, కుమారా ! నా కుమారుణ్ణి తీసుగురండి—అని.

యౌ—రాజమాత మాటలు వంశప్రతిష్ఠకి తగ్గవి. విజయా ! మంచినీళ్ళు తే !

వి—(ఎ. మ. కి వెళ్ళి నీళ్ళు తెస్తుంది)

యౌ—(కొద్దిగా నీళ్ళు తన మీద చిలకరించుగుని, ఆచమనం చేసి) విజయా ! రాజమాత ఏమన్నారూ ?

వి—కుమారా, నా కుమారుణ్ణి చూడు—అన్నారు.

యౌ—హంసకా ! ప్రభువు ఏమన్నారూ ?

హం—వెళ్ళి యౌగంధరాయణుణ్ణి చూడు—అన్నారు.

యౌ—(నీళ్ళు స్పృశిస్తూ) సరే ఇదే నా ప్రతిజ్ఞ. రాహుగ్రస్త చంద్రుడులాగ—శత్రుహస్తగతుడైన రాజుని

విడిపిస్తాను. నా ప్రతిజ్ఞ నేను చెల్లించుగోలేకపోయిన పక్షంలో యౌగంధరాయణుడు అనే పేరు తీసేసుగుంటాను. విజయా! రాజమాతగారితో విన్నవించు.

వి—చిత్తం, స్వామీ! (అని కు. ఎ. కి ఎవరో వచ్చినట్టు గ్రహించడం అభినయించి, అటు వెళుతుంది)

యౌ—హంసకా! మీ ఇరవైమందిలో గతించిన వెందరు?

హం—అయిదుగురు మాత్రమే, అమాత్యా!

యౌ—తక్కినవారు?

హం—చికిత్సాలయంలో ఉన్నారు.

యౌ—మీరు ముందు అమాత్యరుమణ్వాంతుణ్ణి కలిసి, వీలైన వెంటనే ఆయన నన్ను కలియాలని చెప్పండి.

హం—చిత్తం.

యౌ—విదూషకుడైన వసంతకుడుకుడా ప్రభువువారి ఆంతరంగిక స్నేహితుడే. ఆయన ఈ దినం కనిపించలేదు.

హం—అమాత్యులకి తెలియని విషయం కాదు కాని, సంతర్పణ భోజనం ఈ దినం ఎక్కడో తెలుసుగుంటే వసంతకుణ్ణి పట్టుగోవచ్చు.

యౌ—ఔనౌను. కాని, మీకెందుకు లెండి. నేను ఆ పనిమీద విజయుని పంపుతాను.

వి—(కు. ఎ. నించి ఏవో హాస్యవేషపు దుస్తులు పట్టుగుని వస్తుంది)

యౌ—ఏమిటా దుస్తులు ?

వి—ఎవరోవచ్చి ద్వారపాలకుడి చేతికిచ్చారట.

యౌ—ఎందుకూ ?

వి—ప్రభువువారి త్వరితాగమనం గురించి ఒకచోట సమారాధన ఏర్పాటు చేశారట. ఒకడు పిచ్చివాలకంగా వేషం ధరించివచ్చి సావకాశంగా తినండి స్వాముల్లారా. పొట్టల్నిండా మీరు ఆరగిస్తే రాజవంశం గండాలు గడిచి గట్టెక్కి వర్ధిల్లుతుంది, అనేసి తరవాత ఎక్కడో కూచుని కనిపించకుండా పోయాడట—ఈ వేషం అక్కడ వదిలేసి! ఆయన ఎవడో మహానుభావు డనుకుంటున్నారుట !

యౌ—ఏది యేది ఆ వేషం !

వి—(ఇస్తుంది)

యౌ—(ఆవేషం ధరించి, ఆనవాలు లేకుండా మారిపో గలిగినట్టు గ్రహించి) (తనలో) ఓహో ! ఇది నా గురుదేవు శంకరస్వామి చేసినపనే అయివుండాలి. వారు కూడా ప్రభువు వారి యిక్కట్టు తెలుసుగుని, తరణోపాయంయొక్క సూచన నాకు చేసే ఆప్యాయంతో, ఎవరికీ అనుమానం కలిగించ కుండా నేను ఈ పిచ్చివేషంతో ఉజ్జయిని ప్రవేశిస్తే, ఉద యన ప్రభువుని చెర విడిపించడానికి అనువుగా ఉంటుందని రహస్యబోధ చేశారు.

(పైకి) సరేలే, విజయా ! వెళ్ళు. వెళ్ళి రాజమాతని కలుసుగో. విదూషకుణ్ణి నేను రమ్మన్నానని చెప్పు.

వి—చిత్తం (అని ఎ. ఎ. కి వెళ్ళిపోతుంది).

యౌ—హంసకా! విశ్రాంతి తీసుకోండి; అమాత్య రుమణ్వంతుణ్ణి కలియండి.

హం—చిత్తం, అమాత్యా! (అని కు. ఎ. కి వెడతాడు)

యౌ—(తనలో) నిరంతరంగా మథనం చేస్తే కర్రలో నించి నిప్పు పుడుతుంది. ఖననం చెయగా చెయగా భూమిలో జల పడుతుంది. ఎక్కడ కక్కడ జయించుకుంటూ సరైన దారిని వెళ్ళే సాహసజీవికి అసాధ్యమంటూ ఉండదు.

(అని ఎ, మ. కి వెడతాడు)

(తెర)

---

## రంగం-2

[ఉజ్జయినిలో మహాసేనుడి అంతఃపురం. మహాసేనుడికి ఒక ప్రత్యేక పీఠమూ, తక్కిన వాళ్ళకి సాధారణ పీఠాలూ ఉండాలి. ఎ. మ. నించి బాదరాయణుడు వస్తాడు]

బా—(ఎ. మ. నించి వస్తూ) మా మహాసేన మహారాజు గారి అధికార ఆర్జన స్థాపన ప్రయోగాల హడావిడిలో యువరాణి అయిన వాసవదత్తకి వరుణ్ణి చూడడం కాస్త ఆట విడుపు. వాసవదత్తని వరించి వచ్చారు, గురించి వచ్చారు. మహారాజు ఒక పట్టాన ఏ నిర్ణయానికీ రాలేకుండా ఉన్నారు.

కాశీరాజ పురోహితుడు జైవంతి కాశీయువరాజుకి వాసవదత్తని అడగొచ్చారు. ఇటువంటి వారికి, క్రియమాట ఏమైనా, లాంఛన పూర్వ కాతిథ్యంలో లోటు రాకూడదు. అందుకని, జైవంతిగారికి తగ్గ ఏర్పాట్లు చెయ్యడానికి అభీరకుణ్ణి నియమించాను. వారిని సాధారణ అతిథిగా చూడడానికి వీలులేదు. ఎమో, రేపు ఏ నెత్తియాది వారవుతారో! కన్యాప్రదా తాన్వేషణం చేసుకుంటూ ఇంతమంది వరుళ్ళూ వరప్రతినిధులూ వచ్చినా మా మహారాజు తేల్చకుండా ఉన్నారు. పెళ్ళిళ్ళు వాటంతట అవే కుదరాలిగాని, మానవులు కుదర్చలేరు. ఘటన ఉంటేగాని పెళ్ళికాదు.

(ఎ. మ. నించి మహాసేనుడు ప్రవేశిస్తాడు)

—(తలవంచి) ప్రభూ! వందనం.

మ—(ఎ. మ. నించి వస్తూ) ఏమి బాదరాయణా! జైవంతిని అర్హంగా బసచేయించారా?

బా—చిత్తం. అందుకు అభీరకుణ్ణి నియమించాను.

మ—అది చాలదు, కంచుకీ! ఆ అల్పుడి అజాగ్రత్త వల్ల వచ్చేలోటు నాకే ఆరోపిస్తారుగనక, నా బదులు మీ రెళ్ళి చూసిరండి మహారాణిగారికి రావలిసిందిగా కబురు చెయించండి.

బా—మహాప్రసాదం! (అని ఎ. ఎ. కి వెడతాడు.)

మ—వాసవదత్తకి వరుణ్ణి నిర్ణయించడంగురించి, ఈ బాదరాయణుడు ముహోర్వద్దులా నాకు జ్ఞాపకం చెయ్యడమే.

అతడు ఎవడో ఓ యువరాజు అంటాడు. నా పిల్ల కాకపోతే నేనూ అట్లానే అని ఉందును. వాసవదత్త మీాది నా ఆపేక్ష మూలాన్ని ఎన్నేసి సల్లక్షణాలున్నా వరుడికి చాలేటట్టు కనిపించడంలేదు. గొప్పవంశంలో జననం, కోమలత్వం సాను భూతిగల హృదయం, తన స్త్రీని రక్షించుకునేబలం శిక్షించుకునే సామర్థ్యం, సకల స్త్రీజనమూ మెచ్చే సౌందర్యం మొదలైనవి వరుడికి ఉండాలి. కూతుర్ని మరొకరి చేతుల్లో పెట్టేటప్పుడు, తల్లికి కంటినీరు తప్పదు.

సరి, ఎందరు రాజులు నాకు లొంగితేం, వత్సరాజు లొంగ లేదు. అందుచేత నా మహారాజత్వంలో నాకు సంతృప్తి ఏర్పడలేదు. సాలంకాయనుడి దగ్గిర్నించి వార్త లేదు. కృత్రిమ నీలగజం నిర్మించివేసిన యెత్తు నెగ్గిందో లేదో !

[ఎ. వె. నించి అంగారవతి మహారాణి వస్తుంది.]

అం—(తలవంచి) ప్రభూ ! వందనం. ఏమి సెలవు?

మ—వాసవదత్త ఏదీ ?

అం—నారదవీణ నేర్చుకోడానికి వెళ్ళింది.

మ—ఎక్కడికి ?

అం—ఉత్తరఅనే వైణికురాలి దగ్గిరికి!

మ—ఈప్రారంభం అకస్మాత్తుగా చేసిందే అమ్మాయి?

అం—ఎవరో కాంచనమాల నేర్చుకోవడంచూసి తనూ నేర్చుకుంటానని కూచుంది.

మ—అది కన్నెపిల్లకి సహజమైన ధోరణే పోనిస్తూ! మరి పెళ్ళిసంగతి?

అం—అవును. ఈడొచ్చింది, ఉంచడానికివీల్లేదు. చేసెయ్యాలి. చేస్తే పంపేసి వదిలిపెట్టి ఉండాలి. తప్పుతుందా?

మ—వాత్సల్యం ఉండడంసహజం, ధర్మం ఏమిటంటే పెళ్ళిచేసెయ్యడం. ఈరెండింటిమధ్యా తల్లిహృదయం ఉడికి పోతూఉంటుంది. కాశీయువరాజుని నిర్ణయించితే?

అం—ఏమో! (అని కళ్ళనీళ్ళు పెట్టుగుంటుంది)

మ—ఏదోఒకటి తేల్చాలి. ఎవరెవరువచ్చారో చెప్పనా?

అం—ఎందుకు లేస్తురూ! తరవాత బాధపడవలిసిన అవసరం కలిగించనివారి కిస్తేసరి.

మ—ఇప్పుడిల్లాగే అనేస్తావు, తరవాత ఏదేనా కాస్తంత హెచ్చుతగ్గు వస్తే పొడిచి చంపేస్తావు. నువ్వే చెబుదూ! మగధ, కాశీ, వంగ, సౌరాష్ట్ర, మిథిల, శూర సేన రాజులు రాయబారా లంపారు. ఈ సంబంధాలలో ఏది శ్రేష్ఠం అని!

బా—(కు. మ. నించి తొందరగా వస్తూ) వత్సరాజు!... క్షమించాలి ప్రభువులు. జయం జయం మహాసేన మహా రాజలుంగారికి- వార్తయొక్క సంతోషం లాంఛనాన్ని మరిచిపోయేటట్లు చేసింది.

మ—ఏమిటి ఆ వార్త?

బా—వత్సరాజుని బందీగా తెచ్చాడు, సాలంకా యనుడు.

మ —(నమ్మలేక) నిజంగానే? వత్సరాజునే! బందీ గానే! తెచ్చేశాడేం! సాలంకాయనుడే! వత్సరాజుని చూశారా? సాలంకాయనుడు వచ్చాడా?

బా—చిత్తం. శుభద్వారం దగ్గిర వేచిఉన్నాడు.

మ—సంతోషం. ఇప్పుడు నేను మహాసేనున్ణి. మరి, ఉదయనభయం లేకుండా రాజు లంతా ఇప్పుడు ప్రశాం తంగా నన్ను చూడరావచ్చు. బాదరాయణా! సాలం కాయనుడికి అర్ఘ్యస్వాగతం ఏర్పాటు చెయించాలని, భరత రోహకుడితో చెప్పండి. జనం అంతా వత్సరాజు శౌర్యం లోగడ విని ఉండినవాళ్ళే గనక, ప్రస్తుత స్థితిలో అతణ్ణి చూడదల్చిన జనాన్ని వారించకండి.

బా—మహాప్రసాదం (అని కు. మ. కి వెడతాడు)

అం—ఇంత ఆనందం ప్రభువు వారికి ఎన్నడూ కలగ లేదే!

మ—ఇంత సంతోషవార్త నేను ఎన్నడూ వినుండలేదు గనక.

అం—మీ సంతోషాన్ని నేను ఆపలేనుగాని, స్వయం వరానికి సకల దేశరాజులూ ప్రతినిధుల్ని పంపిస్తే పంపనివా డల్లా ఒఖ్ఖ వత్సరాజేన్మండీ!

మ—అవును. భరతవంశంలో జననం. అందులో రాజర్షులూ, వేదవేత్తలూ ఉండడం వించి అతడికి గర్వం. గాన ప్రావీణ్యంతో ఆ గర్వం పైస్థాయిలో పడింది. యవ్వన మదంతో అతడి తల తిరిగిపోయింది. ప్రజలకి తనయందుగల అపూర్వాసక్తి చూసుకుని తన్నిమించిన రాజే లేడని ఊహపడి కన్నూ మిన్నూ గానకుండా ఉన్నాడు.

అం—సరి సరి. అతడి కళంకాలుగా మీరు చెప్పదలిచి చెప్పిన వన్నీ అల్లుడికి ఉండవలిసిన లక్షణాలే కదండీ!

మ—అరె! శత్రువునా నువ్వు మెచ్చడం? ఇతర రాజులు దావానలం అనుకునే నా ఆజ్ఞని పూచికపుల్లగా నేనా కట్టని వాణ్ణి నువ్వు గణించడం?

కా—(కు. మ. నించి వీణ తెస్తూ) సాలంకాయనుడికి స్వాగతం ఇచ్చారు. ఇదుగో ఘోషవతి-వత్సరాజు వీణ! దీంతో అడివి ఏనుగుల్ని పట్టవచ్చు, గారడీచేసి పట్టినట్టు. ఇది మీరు స్వీకరించాలని సాలంకాయనుడి మనవి.

మ—సంతోషం. శుభం. తే. ఇది మన విజయానికి చిహ్నం. ఇది ఎవరికియ్యనూ? పెద్దయువరాజుకి రాజకీయమే గాని గానం సయించదు. చిన్నయువరాజుకి ఒళ్ళంతా వ్యాయామమేగాని చీమంత గానానికేనా స్థలంలేదు. సరే. రాణీ! ఇది వాసవదత్తకి ఇయ్యి.

అం—ఇది అమ్మాయికిస్తే, దాని వీణవెర్రి ముదిరి పోతుందేమో!

మ—పోనిస్తూ, ముదరనీ! పెళ్ళి అయిందాకానేగా! తరవాత వీణా ఉండదు, పాటా ఉండదు—మరో మేళంలో పడాలిగా! బాదరాయణా! వత్సరాజు ఎక్కడా?

బా—గాయాలు చాలా తగలడంవల్ల స్వాధీనంఅయారు. ఆయన్ని సవారీలో అంతఃపురానికి చేర్చారు.

మ—వత్సరాజుకి చాలా గాయాలు తగిలిన సంగతి వినడమేనాకు బాధగా ఉంది. వెనకడుగులేని శౌర్యానికి తగ్గ శాస్తి అయింది. ఈ అవస్థలో అతణ్ణి నిర్లక్ష్యంగా చూడడం క్రూరం. బాదరాయణా! ఆయన సంజ్ఞకుడా ప్రతీదీ మన్నించాలి. ఆయన వైఖరి బట్టి ఆయన సంకల్పం ఇవతలవాళ్లుగ్రహించుగోవాలి. యుద్ధమూ జయాపజయాలూ గురించిన ప్రసక్తికుడా ఎవ్వరూ ఆయన యెదట తీసుగు రాకూడదు. ఆయనికి తుమ్మువచ్చినప్పుడు ఆయనమీాద నీళ్ళు చల్లి ఆయన్ని ఆశీర్వదించాలి. అన్నీ ససందర్భంగా నేర్పుతో నిర్వహించాలి.

బా—చిత్తం. భరతరోహకుడు తమతో ప్రసంగించాలట.

మ—(తనలో) ఓహో! ఇంత అదరణతో వత్సరాజుని చూడడం అతడికి ఇష్టంలేదు గావును. అతడి ఆలోచనకి ఇది చుక్కఎదురు. అతడి మనస్సు తిప్పాలి. (పైకి) సరే బాదరాయణా! భరతరోహకుణ్ణి రమ్మను. కాని, వత్సరాజుకి సత్వరచికిత్స జరగాలిస్మీ!

బా—వత్సరాజుగారికి చికిత్సవచ్చేదారిలోనే అయిందిట ప్రభూ! కట్లు విప్పి మళ్ళీ కట్టడానికి ఇంకా ఆగాలిట. మిట్టమధ్యాహ్నం అయింది. వత్సరాజుగారిని నెమిలికూటమి దగ్గిర ఉంచారు.

మ—ఛీ. అదా ఆయన విశ్రమించడాలకి స్థలం! ఎండ కొట్టకుండా ఆయన్ని మన రంగుబొమ్మల గదిలోకి తీసికెళ్ళండి.

బా—చిత్తం. (అని కు. మ కి వెడతాడు)

అం—వాసవదత్త పసికూన, దాని పెళ్ళికి వచ్చిన తొందర ఏమీ లేదు. నిదానించి మరీచేద్దాం, ప్రభూ!

మ—సరే, నీయిష్టం.

అం—(ఎ. మ. కి వెళ్ళిపోతుంది)

మ—(తనలో)—(ఆలోచన చేస్తూ) వత్సరాజు గర్వం మూలాన్ని నా కతడు శత్రువయాడు. అతణ్ణి ఖైదీగా తేగానే నేను తటస్థుణ్ణి అయిపోయాను. కాని, అతడు యుద్ధంలో అలిసి, దీనావస్థలో ఉండి, ప్రాణాపాయం కూడా తెచ్చుగోడం చూసిం తరవాత, అతణ్ణి గురించి చాలా ఆదుర్దాలో కుడా పడిపోయాను (అని ఎ. మ. కి వెడతాడు)

(తెర)

# రంగం-3

## ఉజ్జయిని—పాడుగుడి మంటపం

[యౌగంధరాయణుడు పిచ్చివాడుగా, రుమణ్వంతుడు బౌద్ధసన్యాసిగా, విదూషకుడైన వసంతకుడు ముష్టివాడుగా సమావేశం. ఇతరులు అనుమానించకుండా వాళ్ళవేషాలకి తగ్గట్టు వాళ్ళు కొంతసేపు వ్యవహరించి, ఇతరు లంతా వెళ్ళిపోడంతోటే తమ ఆంతర్యాలు చెప్పుగుంటారు]

పిచ్చి—(కు. మ. నించి గబగబావస్తూ ఓమాటు నవ్వుతూ ఓమాటు ఏడుస్తూ ఎ. మ. వెడతాడు)

ముష్టి—(కు. మ. నించే చిప్పా దొప్పా పుచ్చుగుని కఱ్ఱమీద ఆనుకుంటూ ఏడుస్తూ) అయ్యో అయ్యో! (అని బారుమని కూలబడతాడు)

బౌద్ధ—(కు. మ. నించే వస్తూ) ఏం నాయనా?

ము—అయ్యో, ఆ పిచ్చోడు!

బౌ—ఏడీ?

ము—ఈ లోపల చచ్చాడు.

బౌ—ఎప్పుడు పోయాడూ?

ము—చచ్చిపోలేదు. నా మిఠాయి ఉండలు లాగేశాడు. (అని కుసిళ్ళుతాడు)

బౌ—ఎన్ని? నాయనా!

ము—లెఖ్ఖట్టలేదు.

బౌ—అన్నీ నీ కెల్లా వచ్చాయీ?

ము.—అసలు నావే. నాకు చాలాయిష్టం.

పి—(నవ్వుతూ ఏడుస్తూ ఎ. మ. వస్తాడు)

బౌ—(పిచ్చివాడితో) నాయనా! భూతదయ చూపించి, పాపం ఆ మిఠాయి ఉండలు ఇచ్చెయ్!

పి—(వెళ్ళి ముష్టివాణ్ణి బాదడం మొదలెడతాడు)

ము—చచ్చాన్రోయ్, నీ చేతులుపడా! మరీవచ్చిం దేన్రా నీకూ?—(సన్యాసితో) నువ్వవతలకిపో బోడిపీనుగా! నీ తీర్పు నీ బుర్రలా ఉంది.

పి—(ముష్టివాడితో పొట్లం చూపిస్తూ) ఇది నీదిరా, నీదిరా, నీదిరా! మతిలేనికుంకా! నాదిరా, నాదిరా, నాదిరా. దుకాణంమీద తస్కరించాను, లేదంటే ఛంపేస్తాను.

బౌ—నాయనా! బుద్ధదేవుడి కిచ్చెయ్!

పి—(పొట్లం ఇచ్చేస్తాడు)

ము—మొహంమండా! అసలవి బుద్ధదేవుడికి సయిస్తాయో లేదో కనుక్కోకుండానే బుద్ధదేవుడి కిమ్మని నువ్వు లాగేస్తావేమిరా పొట్లానికి పొట్లం? అవన్నీ తిన్నావంటే అజీర్తిచేసి చచ్చూరుకుంటావు, చావాలి మేమంతా!

బౌ—నీ కివ్వడానికే, నాయనా!

ము—మరి వెంటనే అల్లా ఏడవ్వేం? రొట్టవేస్తూ పుచ్చుగున్నావేం?

బౌ—నీ మిఠాయి పిచ్చాడు లాగేశాడన్నావు!

ము—అల్లా అనకపోతే నా నోట్లోకి మిఠాయి ఎల్లా వస్తుందిరా వెర్రిఘటమూ! అది నా కెంత ఇష్టమో తెలుసా?

బా—ఇష్టం ఉంటే సరా, నాయనా! మనం యిష్టపడ్డది ప్రతీదీ మనదే అయిపోతుందా?

ము—అవకపోతే ఎందు కొచ్చిందిరా నీ బోడి భూత దయా?

బా—(పొట్లం విప్పి) ఇందులో ఆరు మిఠాయుండ లున్నాయి. మనం ముగ్గురం ఉన్నాం. తలో రెండూ పుచ్చుగుందాం.

ము—పిచ్చిపీనుక్కీ సన్నాసివాడికీ మిఠాయెందుకురా దిక్కుమాలాడా!

పి—ముష్టిపీనుక్కి ఎందుకురా మిఠాయీ? (అని వెళ్ళి బోతాడు)

ము—పోనీ పుచ్చుగోరా నీదుంపతెగా! ఒరేయ్, సన్యాసీ? నీ దేవుడికి మిఠాయెందుకూ? నీ వాటాకుడా నాకు పారెయ్?

బా—మధ్యవర్తికి తిట్లా?

ము—అవేనా ముట్టినందుకు సంతోషించక, ఇంకా సాగుతున్నావేరా, నారసాగినట్టూ—(గంభీరంగా) అమా త్యులారా! అంతా వెళ్ళిపోయినట్టున్నారు. ఇంక మనం కూచుని సమాలోచన కానిత్తామా?

యౌ—కానిత్తాం. (బౌద్ధసన్యాసితో) కూచోండి అమాత్యా!

వ—రాజుగారికి గాయాలు పూర్తిగా నయం అయాయి, వారు ఆరోగ్య స్నానంచేశారు.

యౌ—మీా రెప్పుడు చూశారు వార్ని?

వ—ఉదయం.

యౌ—ఆయన్ని చెరవిడిపించడానికి యత్నిస్తున్నాం. ఇంతవరకు ఫలం కనపడలేదు. కాని, మనం ఆశవదల్లేము. ఆశ మీాదే జీవిస్తున్నాం.

ఆశలేనిదే బతుకేఉండదు
ఫలశూన్యంగా పగలుగడిస్తే
రాత్రి ఫలిస్తుందని ఆశిస్తాం
ఫలరహితంగా తెల్లవారితే
పగలుఫలిస్తుందని ఆశిస్తాం
ఇట్లా కాలం గడుస్తూండగా
ఎన్నో కష్టాలనుభవించుతూ
రాగలఫలాల్ని చేతనైనట్టు
గుణించిచూస్తూ బతకాలిమనం.

రు—నిజమే అమాత్యా! హృదయమూ ప్రజ్ఞా ఉపాయమూ ఆచరణా ఉండి మరీ ఆశిస్తున్నాం. గనక దైవం తోడ్పడి ఫలం సిద్ధించవచ్చు.

యౌ—వసంతకా! ప్రభువుతో చెప్పు. మనం అనుకున్న పన్నాగం రేపే ఆచరించాలి. మంత్రాలతోనూ మూలికల

తోసూ నీలగిరి అనే ఏనుగుని బాగా రెచ్చకొడతాం. అందుకు కావలిసిన వివిధపరికరాలు ఆ ఏనుగు కట్టబడే చోటా, స్నానంచేసే చోటా, తినేచోటా, పడుకునేచోటా అమారుగా ఉండేటట్టు చేస్తాం. గాలివాటం చూసుకుని పొగ రేగేటట్టు నిప్పురాజేస్తాం. దానికోపం హెచ్చడానికి తక్కిన ఏనుగుల్ని దార్లల్లో ఉంచుతాం. ఏనుగుసాల దగ్గిరగా ఖాళీయిల్లు చూసి నిప్పు ముట్టిస్తాం. ఏనుక్కి నిప్పంటే భయంకదా! శంఖాలు ఊత్తాం, ఢంజాలు వాయిస్తాం. ఆ గోలతో అది మరీ బెదురుతుంది. రేపు అంత హడావిడీ మనం చెయ్యగానే, మహాసేనరాజు మనప్రభువు సాయంకోరతాడు. కాబట్టి, శత్రువు కోరికమీద శత్రువు సాయంతోటే మన ప్రభువూ, వారివీణ ఘోషవతీ, ఖైదులోంచి బయటపడాలి, నీలగిరి లొంగాలి. దానిమీదకూచుని, వడిగా దాన్నితోలి, అరణ్యాందాటి, ఎవళ్ళకీ అందకుండా ప్రభువు కౌశాంబి చేరుకోవాలి.

వ—(దీర్ఘాలోచనలోపడి ఊరుకుంటాడు.)

యౌ—ఏమిటి వసంతకా! నువ్వు ఊఁ ఆఁ అనకుండా అల్లా దీర్ఘాలోచనలో పడిపోయావే?

వ—ఊఁ (అని నిట్టూర్పుచేసి) ఏముటో! ఈ యత్నాలన్నీ వ్యర్థం, నన్నడిగితే!

యౌ—అరే! వ్యర్థమా?

రు—ఏమిటో, నువ్వు అన్నమాట, అర్థంకావటంలేదు.

వ—ఎల్లా అవుతుందీ ? నా భావాలు ముందు నాకేగా తెలియడం ! తరవాతేకదా మీకు తెలియడం.

యౌ—అవును, చెప్పు.

వ—వినండి చెబుతాను. వత్సరాజు మీ మైత్రి అంగీకరించడు.

యౌ—వారు ఖైదులోనే ఉండిపోతానంటారా ?

వ—ఓ. భేషుగ్గా,

యౌ—ఆశ్చర్యంగా ఉందే !

వ—వినండి. మొన్న బహుళాష్టమి తరవాత అమ్మవారు ఆలయానికి పూజకి వెళ్ళింది వాసవదత్త. ఆ ఆలయం చెరసాల ద్వారానికి ఎదురుగా ఉంది. వాసవదత్త, కన్యగనక, ఘోషా ముసుగు లేకుండానే సవారీలో కూచుంది. ఒక దాసీది మాత్రం కూడా ఉంది. అక్కడ ఎగుడుబాటుమీద వెళ్ళవలిసొచ్చి బోయీలు భుజాలుమార్చుగోడానికని పల్లకీ చెరసాలఎదట దింపుగున్నారు. శివకుడనే అధికారి అనుజ్ఞ పుచ్చుగుని మన ప్రభువు ఆ రోజునే విహారానికి బయల్దేరారు. అప్పుడు వారు ఆ అమ్మాయిని భేషుగ్గా చూశారు. ఆ క్షణంనించి ఆయనికి చెరసాల స్వర్గంఅయింది. ఆయన వాసవదత్త ప్రేమలో పడిపోయారు. ఇప్పుడు మనలో లేరు. అక్కణ్ణించి రారు.

యౌ—(చికాకుపడి ఆశ్చర్యపడి) ఇదంతా నిజమే ?

వ—నిజమూ యేమిటండీ, నిజమే ! చిక్కులు ఎప్పుడూ జమిలిగానే వస్తాయి.

యౌ—అయితే రుమణ్వాంతా! గుండె రాయిచేసు కోండి. మీరు సన్యాసిగానూ నేను పిచ్చివాణ్ణిగానూ ఎంత కాలం ఉండాలో! ముసిలితనం వచ్చేదాకా ఉండాలేమో!

వ—పైగా, మన ప్రభువు అన్నమాటలు చెబుతాను వినండి! యౌగంధరాయణుడితో చెప్పు: మీరు వేసిన ఈ యెత్తు నా కిష్టంలేదు. దీనితో నేను బయట పడడం మాత్రమే జరుగుతుంది. అంతేకాని, వంచన చేసి నన్ను పట్టిన మహాసేనుడికి తగ్గ ప్రతివంచన జరగదు. అతడి మనస్సుకి తగిలేటంత వంచన చేసి మరీ రావాలని నా కున్నది. నేను మోహాంధుణ్ణి కాలేదు—అని.

యౌ—ఏమో! ఇది నాకు నచ్చలేదు. వంచన రకాల గురించి మాట్లాడినంత మాత్రాన్ని నేను మోసపోను. నాకు బాధగానే ఉంది. ప్రభువు కాళ్ళకి సంకెళ్ళా! కటికినేలమీద స్వంతంగా తనే గడ్డి పరుచుగుని ఆయన పడకా! ఈ బాధల్లో శృంగార వ్యాపారమా? పైగా వారు అది కాదనడమా!

వ—అందుకనే, అయ్యా! మంత్రులారా! మన ప్రభు భక్తి మనం యథాశక్తిగా చూపించాం. కించిత్తూ లాభించ లేదు. రాం రాం! పోదాం. ప్రభువువారి కర్మం!

యౌ—వసంతకుడేనా ఈ మాట్లాడేదీ? అట్లా అనకు వసంతకా! ఆయనకి మనం స్నేహితులం. ఏడవాలో సంతోషించాలో తెలియకుండా ఆయన ఇప్పుడు శోక

శృంగారాల మధ్య బాధ పడుతున్నారు. మనం వారిని వదిలేద్దామా ?

వ—ఆఁ. వదిలెయ్యాక ముసిలి వరుగు లయేదాకా ఇక్కడే ఉందాం !

యౌ—ఉంటే చాలా శ్లాఘనీయం.

వ—మనం ఇల్లా ఎందుకున్నామో జనానికి తెలిసేడిసి నప్పుడు గదండీ, శ్లాఘనీయమూ ? లేక జనానికి తెలియ కుండానే మీపని శ్లాఘనీయం అని నేనూ నాపని శ్లాఘనీయం అని మీరూ అనేసుగుంటే చాలంటారా ?

యౌ—మనం ఏదీ ప్రపంచం చూడాలని చెయ్యాం. మన ప్రభువు నిమిత్తం మనం ఏమైనా సరే చేసేస్తాం.

వ—పోనీ ఆ ఒఖాయనా కుడా గ్రహించటం లేదుగా మనచిక్కు !

యౌ—కాలక్రమాన్ని గ్రహించి తీరతారు.

వ—గ్రహించే ముహూర్తం ఎప్పుడొస్తుందో కదా, అనేగా యిప్పుడూ.

యౌ—మన ఎత్తు నెగ్గినప్పుడు.

వ—అయితే కర్తవ్యాలు రెండు. రెండూ సాధించండి. వత్సరాజుని చెరలోంచి బయటికి తియ్యాలి. వాసవదత్తని అంతఃపురంలోంచి ఇవతలకి లాగాలి.

రు—వసంతకా ! కచ్చితంగా చెప్పేశావు. అయ్యా ! మీరు ఈ రెండుకార్యాలూ కుడా సాధించాలి.

యౌ—ప్రతిజ్ఞ చేస్తున్నాను. రాజుని చెరలోంచి విడిపిస్తాను. అతడు వాసవదత్తని—అర్జునుడు సుభద్రనిలాగ—తీసుగు పోవడానికి అనుకూల్యం కలిగిస్తాను. లేకపోతే నాపేరు యౌగంధరాయణుడు కాదు.

(కు. వె. కి చూస్తూ) ఇట్నుంచి ఎవళ్ళో వస్తున్నారు. పోదాం. అదుగో అదుగో అదుగో, మిఠాయుండలు. లాగేస్తున్నావ్, చంపేస్తా, చంపేస్తా! (అని కు. ఎ. కి పోతాడు)

వ—మీ బంగారుచేత్తో రెండుగింజ లెయ్యండి బాబూ! (అని ఎ. మ. కి పోతాడు)

రు—బుద్ధదేవా, శరణు. (అని ఎ. ఎ. కి పోతాడు)

(తెర)

---

## రంగం-4

[రెండో తెర ఎదట. ఉజ్జయిని మామూల సందు. పిచ్చివాడు ముష్టివాణ్ణి బరా బరా ఈడ్చుగువచ్చి కొడతాడు, కు. ఎ. నించి ప్రవేశం.]

పి—(కొడుతూ) దానికి పిచ్చెత్తిందా లేదా?

ము—(ఏడుస్తూ) ఆ ఆ కొట్టకురా బాబూ

పి—(కొడుతూ) వాళ్ళకి తారెత్తిందా లేదా?

ము—ఆ. ఆ, కొట్టకురా నీదుంపతెగా

పి—(కొడుతూ) పెద్దాడికి భయంవేసిందా లేదా ?

ము—ఆ. ఆ కొట్టకురా నీ చెయ్యిపడా.

పి—(కొడుతూ) చిన్నాణ్ణి తీశారా లేదా ?

ము—ఆ. ఆ. కొట్టకురా నీ మొహంమండా.

పి—(కొడుతూ) చేతులో ఉంచారా లేదా ?

ము—ఆ ఆ కొట్టకురా నిం దగలెయ్యా !

పి—సరే కొట్టను, సరిగ్గా చెప్పు. చుట్టుపక్కల జనం వెళ్ళి పోయార్లే. తిన్నగా కూచో వసంతకా ! మనిద్దర్నీ ఎవరో చూస్తూండడంవల్ల నిన్ను బాధపెట్ట వలిసొచ్చింది. వాళ్ళు వెళ్ళరేమో అని గాఢంగా ప్రసంగిచాను. నీలగిరికి పిచ్చెత్తి, ఊళ్ళో రాదెత్తి, మహాసేనుడికి భయంవేసి, వత్స రాజుని చెరలోంచి తీసి, ఆయన వీణ ఆయనచేతులో ఉంచే దాకా అడిగాను.

వ—అవును అమాత్యా ! ఆ యెత్తు నెగ్గింది. ప్రభువు ఘోషావతి పలికించి నలగిరిని సాధువుని చేశాడు. అది మేకలా అయి సాలలోకి వచ్చేసింది. కృతజ్ఞతతో మహా సేనుడు ప్రభువుని అంతఃపురంలో పెట్టుకుని వాసవదత్తకి వీణావిద్యాగురువుగా నియమించారు. ప్రభువు వాసవదత్తకి సకల విద్యలూ నేర్పుతున్నాడు. వాళ్ళు అన్యోన్య ప్రేమలో ఉన్నారు.

యౌ—సరి, మరి ప్రకృతం ఆలోచించి పోదాం. ఈ దినం ప్రభువుని చూశావా ?

వ—చూశాను.

యా—మన రెండో పన్నాగం ప్రభువు వాసవదత్తతో చెప్పారా ?

వ—లేదు. అక్కర్లేదన్నారు.

యా—అయ్యో! అదేం ?

వ—వాసవదత్త తన ఏనుగు భద్రావతిమీద స్నానానికి వెడుతుందిట. అప్పుడు అరణ్యంవైపు కొంచెం విహారించి వస్తానని ప్రభువుతో చెప్పిందిట, తను వెనకాలే వచ్చేవరకూ విహారం వెడుతూండమని ఆయన ఆమెతో చెప్పారుట.

యా—ఓ. అదిచాలు. భద్రావతికి మావటివాడు గాత్రసేవకుడు. వాణ్ణి చూశావా ఇదివరకు ?

వ—ఆ!

యా—అయితే పన్నాగం విను. వాసవదత్త వెళ్ళిన తరవాత, ఇంకా అంతఃపురంలోనే ఉన్నట్టూ, స్నానానికి వెళ్ళదలచినట్టూ, గాత్రసేవకుణ్ణి పిలుచుగు రమ్మన్నట్టూ, ఒక అమాయికపు యోధుడికి వాసవదత్త దాసీచేత చెప్పించడానికి ఏర్పాట్లు చేశాను.

వ—సరే బాగానే ఉంది. అమాత్యా! ఇంకేం కావాలీ ?

యా—సరే. ఇదా గ్రహించావు ? గాత్రసేవకుడేడీ ? ఎవడో ఒకడు ఉండి తనే గాత్రసేవకుణ్ణని ఆ యోధుడుతో అంటూ ఆలస్యం చెయ్యాలి. చేస్తే వాసవదత్త దూరదూరంగా వెడుతూంటుంది. ఆలస్యం చెయ్యకపోతే వెంటనే పట్టేస్తారు.

వ—అయితే నేను గాత్రసేవకుణ్ణవుతాను.

యౌ—అయితే చాలదు, వసంతకా! తాగినట్టు నటించాలి.

వ—ఎంతసేపు నటించాలీ?

యౌ—భద్రావతి వెనకాల నీలగిరి వెనుతోండని తెలిసేదాకా!

వ—తరవాత వేషం తీసేసి, నేను ఫలానాఁరోయ్ అని మీాసంమీాద చెయ్యేసి చెప్పవచ్చా?

యౌ—ఓ.

వ—అయితే సరే.

యౌ—జాగర్త వసంతకా! మొహం, కళ్ళు, వాలకం, మాట, నడక—అన్నింటిగురించీ ఉండాలి, జాగర్త! తూలిపోతూన్నా తేలిపోకూడదు. (అని కు. ఎ. కి. పోతాడు.)

వ—సరేనండి. (అని ఎ. ఎ. కి పోతాడు.)

[రెండోతెర లేస్తుంది వీధి కు. మ. నించి ఒకయోధుడు వస్తాడు]

యో—(కు. మ. నించి వస్తూ) వీడెక్కడచచ్చాడో! యువరాణిగారు స్నానానికి వెడ్తారట బద్దరావతి రావాలంట. ఆమూావటోణ్ణి పిల్చుగురమ్మన్నారు. వాడు కనపడ్డు. వాడో చుక్కపడితేగాని ఆగలేడు. సారాసందులోకి వచ్చాడన్నారు. గాత్రసేవకా! గాత్రసేవకా. (అంటూ ఎ. వె. కి. వెడతాడు.)

గా—(ఎ. ఎ. నించి వెర్రినవ్వుతో ఎర్రకళ్ళతో వస్తూ) ఎవడ్రా రాచబాటమీాంచి నన్ను గాత్రసేవకా గాత్ర

సేవకా అని ఊరికే పిలుస్తూంటూ? చెబుతావా లేదురా? (నవ్వుతూని) సెప్పకపోతే సూడు మరేం జేస్తానో! (కోపంగా) సెప్తావా లేదురా శనీ, ఒరేయ్ సంపేస్తానురోయ్, పేగులు మెళ్ళో యేసుగుంటాన్రోయ్! (బాగా కళ్ళు మూసుగుపోయి) సెప్పు. లేకపోతే నిన్నిల్లా కొడ్తాను (అని కొట్టుగుంటాడు) అరె! (అని నాలిక కరిచిపెట్టి) నన్ను కొడ్తావురా? ఇల్లా సంపేస్తా (అని మెడమీద కొట్టు గుంటాడు) అయితే, రా, రా (అని గాలితో పోట్లాడతాడు.)

తాగుడు దేవీ! దాసుడుదణ్ణం
నీ అవతారాల్ సాలాడున్నాయి
దేన్నికొలిచినా, నువ్ రక్షిస్తావ్
నిన్నుగ్రహిస్తే అంతా యిశదం
కొందరుమూర్ఖులు సుక్కేఎరగరు
అయినా తెగవాగుతూఉంటారు
యిషయం ఎరగనిసచ్చినోళ్ళు మరి
ఎరగనట్టు పడిఉండకూడదూ?
నిన్నెరగనివాళ్ళని చంపేశెయ్
నీమహిమలు మాటకిలొంగవుగా
అతిసంతోషంలో మాటరాదు
ఇంక నమస్తే నమస్తే నమః

యో—(కు. ఎ. సించి ప్రవేశించి మనిషిని చూసి) అమ్మ, వీడే! ఏయ్, గాత్రసేవకా!

గా—ఎవఁడ్రా?

యో—ఏయ్, జాగర్త. నేను యోధుణ్ణి.

గా—అయితే! ఏమిటి?

యో—ఎంతసేపణ్ణించో నిన్ను వెతుగుతున్నాను. యువరాణి వాసవదత్త స్నానానికి వెళ్ళడానికి భద్రావతిని సిద్ధం చెయ్యాలి. అది సాలలో కనపట్టంలేదు! నువ్వు తప్పతాగి తిరుగుతున్నావు.

గా—సీ. అబద్ధం. నే తిరగప్లేదు.

యో—ఛీ, నోరుముయ్,

గా—ముయ్యను. నిజమే ఆవిడ తాగింది. ఆవిడమనిషి తాగేశాడు. నేను తాగేశాను. నువ్వూ తాగేశావు. ఈ బూమ్మీద పెతీవోడూ పెతీదీ తాగేసిన రకమే.

యో—సరే. ఆ సంగతులు అల్లాఉండనీ! నువ్విక్కడ ఉన్నావేం? భద్రావతిని తేవడానికి వెళ్ళవేం?

గా—తిరిగి ఇక్కడికొచ్చాను. ఇక్కడే తాగుతున్నాను. (ఓ కొమ్మువంటిది చూపించి) దీన్తో తాగుతున్నాను.

యో—నీమతి శూన్యపువాగుడు చాలించు. వెంటనే వెళ్ళి భద్రావతిని తే.

గా—పోనీ దాన్నే రమ్మను. పోనీవద్దు. నేనే అంటాను. ఒసేవ్, భద్రావతీ రావే. అయ్యో! ఎల్లా? నా అంకుశం లేదు, తాకట్టెట్టి తాగేశాను.

యో—దిక్కుమాలి అంకుశం పోనిస్తూ! భద్రావతి శాంతమూర్తి. దానికి అంకుశం అనవసరం. వెళ్ళి! భద్రావతిని తీసుగురా.

గా—అదే. వస్తుందోయ్ ! ఒసేయ్, భద్రావతీ! రావే ! అయ్యో ! ఎల్లా ? దాని చంద్రహారంకూడా లేదు. అదీ తాకట్టెట్టి తాగేశాను.

యో—ఫరవాలేదు. మనం భద్రావతి మెళ్ళో ఓ పూల దండ పారేద్దాంలే. తక్షణం వెళ్ళి భద్రావతిని తీసుగురా.

గా—అదే వస్తుంది లేస్తూ! ఒసే, భద్రావతీ, రావే! అయ్యో, దాని గంట కుడాలేదు. అదీ తాకట్టెట్టి తాగేశాను.

యో—పోనీలే. ఏనుగు వెడుతూంటూ నీళ్ళల్లోకిగా ! దానికి గంట అనవసరం ఇప్పుడు. తక్షణం వెళ్ళి భద్రావతిని తీసుగురా.

గా—అదే వస్తుందబ్బాయి ! ఓసి బద్దరోతీ రాహెయ్ ! అయ్యో! దానికి కొరడా కుడా లేదు. అదీ తాకట్టెట్టి తాగేశాను.

యో—నీకు మతిలేదు. దానికి కొరడా ఉండదులే. వెంటనే వెళ్ళి దాన్ని తీసుగురావోయ్ !

గా—ఓ, అల్లానే (అనిలేచి)—(ఎ. మ. కి చూసి) బద్దరావతీ ! రా ! రమ్మంటే ! (ఏడస్తూ) అయ్యో !

యో—ఓరి నీ అయ్యో మండా! చంపేస్తున్నావే! ఇంకా ఏమిటీ ?

గా—అయ్యో ! నేనెం జేశానా.........

యో—ఎంజేశావ్ ?

గా—అయ్యో ! బద్ధరావతీ !

యో—ఏం ఏం ? ఏమైంది భద్రావతి ?

గా—నేను దాన్ని కూడా తాకట్టెట్టి తాగేశాను.

యో—సరేసరే. అల్లా చెప్పూ. అది నీ తప్పుకాదులే. రాచయేనుగుని తాకట్టు వస్తువుగా ఒప్పుగున్న సారాకొట్టు వాడిదే తప్పంతా.

గా—(గారాంగా) ఆడీంతో నేను సెప్తేనే! వొడ్డీలాభం మీాద కన్నేస్తే అసలుకి మోసంరా అని!

యో—ఆగాగు. (అని వినడం అభినయించి) ఏదో గోల! నీకు వినబడుతోందా ?

గా—ఆ. భద్రావతి సారా తాగి పారిపోతోంది. చుట్టుపక్క జనం భయంవేసి గోలచేస్తున్నారు.

యో—ఏమిటి అంటావ్ ? (ఎడమ పక్కనించి 'భద్రావతి' 'పారిపోతోంది' 'పారిపోతోంది' వెనకాల 'నలగిరి' నలగిరి'—అని కేకలు వినిపిస్తాయి)

గా—(సంతోషంతో నిబ్బరంగా) అమ్మయ్య ! ప్రభువు అడ్డంకులు లేకుండా దాటాడు.

యో—ఒరేయ్ ! ఇంత అవాంతరం జరిగిం తరవాత నువ్వింకా తాగుతూ కూచోరా !

వ—(లేచి) కూచోన్రా ! ఎవ్రడ్రా తాగిందీ ? ఏమిట్రా తాగుతా, ఆనందమూ, సారాయా ? ఓరి అబ్బికానా, ఎవడికిరా మతిలేకపోతా ! మేం యౌగంధరాయణ చారులం. (అని కు. మ. కి జరిగి) ఇదుగో (అని ఒక ఎర్రగుడ్డ ఊపి) నా స్నేహితులకి సంజ్ఞచేశాను. ఇల్లావచ్చి చూడు వాళ్ళని, వాళ్ళంతా వేషాలు విడిచేసి కూసంవిడిచిన తాచుల్లా ఉన్నారు.

యౌ—(భయంతో) అయ్యబాబో! (ఎ. మ. కి పారి పోతాడు)

వ—ఏమనుకున్నావ్? ప్రభువు ఉప్పుతిని ప్రభువు తరఫున పోట్లాడుతూ చచ్చిపోనివాడికి నీచమరణమూ నిరంతర నరకమూ రావాలి.

[కు. మ. నించి రాలుతూ కాలిమీదా చేతిమీదా తలమీదా గాయాలతో విరిగిన కత్తితో యౌగంధరాయణుడు వస్తాడు]

వ—(కు. మ. నించి వచ్చే యౌగంధరాయణుణ్ణి చూసి) అయ్యో! అమాత్య యౌగంధరాయణా (అని ఆయన్ని పట్టుగుని, వస్త్రం చీరి పీలికలు కాలికీ చేతికీ తలకీ చుట్టి) ఎంతపని జరిగింది, ఎంతపని జరిగింది!

యౌ—(మూలుగుతాడు)

వ—ప్రభువు వెంట వెళ్ళవల్సిన భటుల్ని ఎదురుకున్నారు గావును. ఘోరం! అంత మందిమీద ఒకరా?

యౌ—రుమణ్వంతుణ్ణి ముందు పంపేశాను. నువ్విక్కడ ఉండవలి సొచ్చింది. కత్తి ఒక ఏనుగు దంతానికి తగిలి విరిగి పోయేదాకా దెబ్బలాడాను. మన బలగం వస్తోందను కొని వాళ్ళు వెనక్కి పోగా, నేనిట్లా వచ్చాను. మరి పోట్లాణ్ణు. పట్టుబడడమే. ప్రభువుని తన రాణితో సహా దాటించాం. వారి పేరు ప్రతిష్ఠలు దక్కించాం.

వ—నిశ్చయం అమాత్యా! దైవానుకూలంవల్ల కార్యం నిర్వహించాం. మరి మన్ని ఖైదులో పెట్టుగోమనండి. మిమ్మల్ని వీధుల్లో ఊరేగించనీండి—మీరు పిచ్చివాడుగా

తిరిగిన వీథుల్లో! అప్పుడు ఎంత త్యాగం చేస్తే మంత్రి కావచ్చో జనానికి తెలుస్తుంది.

యో—(కత్తి ధరించి కు. మ. నించి వస్తూ) ఏయ్! నేను రాజద్రోహిణ్ణి.

వ—(గట్టిగా సకిలిస్తాడు)

యో—(హడలిపడి, సర్దుకుని) వీడు మా ఖైదీలు. భద్రావతిని పట్టుగున్నారుట.

యౌ—అసంభవం. భద్రావతి అడవుల్లో హుటాహుటిగా పోతుంది. దాన్ని ఎవరూ అందుకోలేరు.

యో—అందుకనే నలగిరి యెక్కి మరొకరు వెంటాడుతున్నారు.

యౌ—నలగిరిమీద వత్సరాజు తప్ప మరొకడు ఎక్కనే లేడు.

యో—వారి వెనకాలా వెడతారు భటులు.

యౌ—వెడదాం అనుకుంటూంటేనే వాళ్ళని పడుకోపెట్టి వచ్చాను.

యో—వీళ్ళో యౌగంధరాయణుణ్ణి కోటలో ఖైదు చేసి కాపలా వేస్తారట.

యౌ—నేనే. వచ్చి సంకెళ్ళు వెయ్. కాని, నవ్వొస్తోంది. నగ పోయింతరవాత పెట్టె భద్రం చేసుగున్నట్టుంది.

యో—(సంకెళ్ళు వేసి కు. మ. కేసి చూస్తూ) అదుగో అమాత్య భరత రోహకులు! ఇటు వస్తున్నారు.

యౌ—(తనలో) ఈ భరతరోహకుణ్ణి బుద్ధిప్రజ్ఞవల్ల నేను జయించాను. ఇతడు ఉసూరు మంటూ వస్తూం

టాడు......ఎన్నిసార్లు కుస్తీపడితే అన్నిసార్లూ చిత్తయిన వస్తాద్‌లాగ తల వాల్చేశాడు.

[వ. వ. నించి భరతరోహకుడు వస్తాడు]

భ—(తనలో) ఈ యౌగంధరాయుణ్ణి ఎల్లా ఈ అవస్థలో చూడడం? కేవల ప్రభుభక్తి తత్పరుడై ఈ స్థితి తెచ్చుగున్న మహానుభావుణ్ణి ఏమోహం పెట్టుగుని దెప్పనూ! ఇతడు పన్నాగం అమోఘంగా వేశాడు. అప్రమత్తుడై దాన్ని ఆచరించాడు. బుట్టలోకి పట్టినా బుసకొడుతూనే ఉన్న పాంలాగ తల ఎత్తుగునే ఉన్నాడు. (పైకి) ఓరీ! ఆయన సంకెళ్ళు తీసెయ్.

యో—(యౌగంధరాయణుడి సంకెళ్ళు తీసేస్తాడు)

భ—యౌగంధరాయణులకు వందనం.

యౌ—భో అమాత్య భరతరోహకా! ఆశ్చర్యంగా ఉందే! నా శరీరం, సార్థక యోధుడి శరీరంలాగ, రక్తసిక్తం అయింది. తండ్రి మరణానికి ప్రతిక్రియ చేసిన అశ్వత్థామలాగ నేను ప్రశాంతంగా ఉన్నాను.

భ—అమాత్యా! ఎత్తువేసి నెగ్గినప్పుడు కూడా ఆత్మస్తుతి అవసరమేనా?

యౌ—తమరు మిథ్యాగజంతో వేసింది ఎత్తుకాదా, అమాత్యా!

భ—వివాహం కొందే కన్యని లేవదీసుకు పోవచ్చా, వత్సరాజు?

యౌ—వారికి లోగడే వివాహం అయింది గాంధర్వ విధిని, తమ రెరక్క పోవచ్చు.

భ—మహాసేనుడి మీద ఇంతంత కుట్రలు చేస్తున్నారు గదా, చివరకి వత్సరాజు ఏమవుతాడో, కౌశాంబి ఏమవు తుందో అనే భీతిలేదా మీకు?

యౌ—మీ ప్రశ్న వింటే నవ్వొస్తోంది నాకు. మా ప్రభువు మీ కళ్ళముందునించేగా తప్పించుగుని బహి రంగంగా వెళ్ళింది? ఆయనగురించి బెంగ నాకెందుకూ? కౌశాంబి గురించి నాకూ బాధెందుకూ? మాను నరికిన తరవాత కొమ్మలు కొట్టలేదే అని దుఃఖిస్తారా ఎవరైనా?

[కంచుక ఎ. మ. నించి ప్రవేశిస్తాడు]

కం—(ఎ. మ. నించి వచ్చి, ఒకఉత్తరమూ ఒకబంగారు పాత్రా భరతరోహకుడి చేతికిస్తూ) అమాత్యా! మహాసేన మహారాజు ఇవి మీ ద్వారా యౌగంధరాయణుల కిమ్మ న్నారు.

భ—(ఉత్తరం పుచ్చుగుని, చూసి) అమాత్య యౌగంధ రాయణులకి—(అని యౌగంధరాయణుణ్ణి చూసి) నా యెడల మీరుచేసిన తప్పిదంలేదు. మీ గుణాలు ప్రశంసకి పాత్రం. గతం మరవండి. నా సుహృద్భావానికి చిహ్నమైన ఈ పాత్ర స్వీకరించండి. (అని పాత్ర కంచుకి దగ్గిర్నించి తీసుగుని ఇయ్యబోతాడు).

యౌ—అయ్యా! నే ముట్టించిన యిల్లు ఇంకా కాల్తూ ఉంటూండగానే, మరణశిక్షకి పాత్రుణ్ణయిన నేను ఈ బహూకరణ స్వీకరించడం ఉచితంగా కనపడదు. క్షమించండి. (ఎ. మా. నించి పెద్దగోల వినపడుతుంది).

భ—(ఎ. మ. నించి పెద్దగోల వింటూన్నట్టు నటించి) ఏమిటి చెప్మా ఆ గోలా? డేగ తన్నుకుపోతూన్న పావురం చేసే గోలలాఉందే! కంచుకీ! తక్షణం వెళ్ళి అదేమో కనుక్కొని వెంటనే వచ్చి చెప్పు.

కం—(ఎ. మ. కి వెడతాడు)

భ—అమాత్యా! మహాసేన ప్రభువుమాటలు మీరు విన్నారు. నా మాట ఒకటి వినండి. విజయవంతమైన మీ ప్రభుభక్తి మీ చేతులో అపజయం పొందిన పక్షంయొక్క మన్నన ఇంత త్వరలో పొందుతోందీ అంటే, దాని మహిమకి వేరే తార్కాణ కావాలా? నా రాజు గుణగ్రహణ పారీణుడు, వీరరసమయుడు. మీ సచ్ఛీలం గుర్తించి చంపతగ్గవారై మీరు చే జిక్కినా మిమ్మల్ని ఆదరించి పంపుతున్నారు—అని నా ఊహ. సభక్తికమైన నా ఊహని మన్నించండి.

కం—(ఎ. మ. నించివచ్చి) అమాత్యా! తల్లిదండ్రులకి తెలియకుండా యువరాణి వత్సరాజుతో వెళ్ళిపోయి నందుకు అవమానమూ దుఃఖమూ భరించలేక, మహారాణి మేడ మీదినించి దూకి చనిపోవాలని సంకల్పం చెయ్యగా మహా

రాజు వెళ్ళి, ఆవిణ్ణి వారించి, తమ కుమార్తెకీ వత్సరాజుకీ తత్పూర్వమే గాంధర్వ విధిని పెళ్ళి అయుండడమూ క్షత్రియ మర్యాదలలో అది అనుమతింప బడడమూ ఆనందించ వలిసిన సమయంలో దుఃఖించడం శోచనీయం కావడమూ, వత్సరాజ వాసవదత్తల చిత్రపటాలు సరసనిపెట్టి తంతు నడిపి వారి వివాహం జరిగిన సంగతి తమరే ఘోషణ చెయించడం కర్తవ్యంగా కనిపించడమూ, ఆమెకి నచ్చ చెప్పారట. అంతఃపుర స్త్రీలంతా వివాహ యత్నాలు చేస్తూ వివాహ పరికరాలన్నింటినీ తమ ఆనందబాష్ప జలంతో క్షాళన చేసి అమరుస్తున్నారట.

యౌ—అనగా, మహాసేన మహారాజుకూడా ఈ వివాహ సంబంధం అంగీకరించారన్నమాట. అయితే, అమాత్యా! ఆ బహుమతీపాత్ర స్వీకరిస్తాను; ఇల్లా ఇయ్యండి.

భ—మహాసేన మహారాజు ఇంకా తమరికి ఏం జెయ్యాలని తమ కోరిక ?

యౌ—కోరింది జరిగింది. ఇక, వారిదయ మాకు చాలు. (అమాత్యులు పరస్పరం నమస్కరించుకుంటూ ఉండగా,)

(తెర)

---

# స్వప్నం

(ఆరురంగాల రూపకం)

## పాత్రలు

ఉదయనుడు (వత్సరాజు)

యౌగంధరాయణుడు (మంత్రి-కాలవేది)

వసంతకుడు (విదూషకుడు, రాజస్నేహితుడు)

విద్యార్థి

ఉదయన కంచుకి

మహాసేన కంచుకి (బాదరాయణుడు)

వాసవదత్త (ఉదయన భార్య-జలజ)

పద్మావతి (మగధరాజైన దర్శకుని సోదరి)

మల్లిక (దాసి)

## రంగాలపేర్లు

1 యౌగంధరాయణ పన్నాగం

2 లావాణక వృత్తాంతప్రకటన

3 పద్మావతీ వివాహనిశ్చయం

4 అంతర్యక్షోభలు

5 స్వప్నవాస్తవికత్వం

6 చిత్రపట దాంపత్యం

## రంగం—వచ్చే పాత్రలు

1 వ. వా, యా

2 యా, వా, ప, కం, ఐ

3 ప, వా, మ

4 వ, మ, ప, వా, ఉ

5 ఉ, వ, వా, కం

6 బా, మ, ఉ, ప, వా, యా

## పాత్ర—వచ్చే రంగాలు

ఉ—4, 5, 6

యా—1, 2, 6

వ—1, 4, 5

ఐ—2

ఉ కం—2, 5

మ కం—6

వా—1, 2, 3, 4, 5, 6

ప—2, 3. 4, 6

మ—3, 4, 6

# రంగం-1

[ఒక ఉన్నత పీఠంమీద వాసవదత్త కూర్చుని ఉంటుంది. ఒక పక్క వీణ ఉంటుంది. కు. ఎ. నించి వసంతకుడు వస్తాడు]

వ——(కు. ఎ. నించి వస్తూ) మహారాణీ, శుభమస్తు!

వా——(లేచి, నమస్కరిస్తూ) దయచెయ్యండి, మహాత్మా! చంద్రికని పంపి ఫలారం తెప్పించుతాను. ఒసీ!

వ——అమ్మమ్మమ్మ! పిలవకండి. వాళ్ళెవళ్ళూ లేకుండా చూసుగుని రావడం అయింది. తమరి దర్శనం నిమిత్తం కాలవేది అనే ఒక తపసి వచ్చారు.

వా——మహారాజుగారి దర్శనం అయిందా?

వ——లేదు. ఏదో ఒక పరమార్థం ఉందిట. తమరే కటాక్షించాలిట.

వా——నావల్ల అయేది నేను ముఖ్యంగా చేస్తాను. వారిని రమ్మనండి. ఇదుగో పీఠం! (అని ఒక పీఠం పక్కనించి తెచ్చి వేస్తుంది.)

వ——చిత్తం చిత్తం. (అని, కు. ఎ. కి వెళ్ళిరాగా, వెనకాలే తపసి వేషంలో యౌగంధరాయణుడు వస్తాడు.)

వా——(తపసికి నమస్కరిస్తూ) మునీశ్వరా! వందనం. దయచెయ్యండి. తమ రాకవల్ల మా గృహం పావనం అయింది.

వ——అమ్మా! తమరు వీరిని ఇదివరకు చూశారు.

వా—లేదు, మహాశయా, చూడలేదు.

వ—అమ్మా క్షమించండి. ఆశ్చర్యం తట్టుగోండి. వీరు అమాత్య యౌగంధరాయణులు!

వా—ఔరా! ఏమి అద్భుతం! ఏమిటిది అమాత్య శేఖరా!

యౌ—అమ్మా! క్షమించండి. మహాప్రభువుకి తెలియకుండా కొంత గ్రంథం జరగవలిసిన అవసరం వచ్చి పడింది. ఆ జరగబోయే కాండలో నేను ధరించ వలిసొచ్చే వేషం ఇప్పుడే ధరించి ఇతరుల్ని మోసగించడానికీ మీకు చూపించడానికీ వచ్చాను. మరి తీసేస్తాను. (అని గడ్డమూ కాషాయి లుంగీ తీసేస్తాడు)

వా—జరగ వలిసి ఉన్నది సెల వియ్యండి, అమాత్యా!

యౌ—మహారాణీ! మన రాజరికం పోయే అవాంతరం వచ్చింది. ఆరుణి అనే రాజు లేచాడు. వాడు చెడిబతిగిన నీచుడు. వాడు మన వత్సరాజ్యంలో చాలా భాగమూ రాజధాని కౌశాంబీ కుడా తనవే అంటున్నాడు. వాడు మన మీద విధిగా దాడిచేస్తాడు. వాడి ధాటికి నిల్చి రాజ్యం నిలబెట్టుగునే త్రాణ మన దగ్గిర లేదు. ప్రభువువారి ఆంతరంగికులమైన నేనూ, ఈ వసంతకుడూ, రుమణ్వంతుడూ కలిసి సంప్రతించాం. మాకు ఒకే ఒక పన్నాగం తోచింది. ఆ రహస్యం తమతో చెప్పాలని వచ్చాను.

వా—మహారాజుగారితో చెప్పకుండానే!

యౌ—చిత్తం. వారు ఈ పన్నాగానికి ఒప్పుకోరు. ఈ పన్నాగం తప్ప గత్యంతరం లేదు. ఈ పన్నాగం ఆచరించి నెగ్గకపోతే మన రాజ్యం మన కుండదు.

వా—అయితే ఈ పన్నాగం అవశ్యంగా ఆచరించి తీరాలి. సెలవియ్యండి.

యౌ—మగధదేశ రాజు దర్శకుడు. అతడు మనకి సాయపడితే దుష్టుడైన ఆరుణిని అవలీలగా ఓడించవచ్చు.

వా—సరే. దర్శకరాజు సాయం కోరండీ! మరి పన్నాగం ఏమిటీ ?

యౌ—ఆయన తన బంధువులకి కూడా ఓ పట్టాన సాయానికి రాడు. అతడితో మనకి ఇదివరలో బాంధవ్యం లేదుగనక ఇప్పుడు చెయ్యాలి, చేసి సాయం అడగాలి.

వా—సరే, అమాత్యా ! చెప్పండి.

యౌ—దర్శకరాజు చెల్లెలు పద్మావతి. ఆ పద్మావతిని మనం కలుపుగుంటే తప్ప అతడు మనకి సాయపడడు.

వా—కలుపుగోడం అంటే పెళ్ళాడ్డం అనేగా తమరి సంకల్పం? మన ప్రభువువారు ఆ అమ్మాయిని చేసుగుంటేసరి!

యౌ—అమ్మా క్షమించాలి. తమరు ప్రభువువారి బహిఃప్రాణమని మాకు తెలుసు. రెండో స్త్రీని కూడా వివాహం చేసుగోండి ప్రభూ! అని వారిని కోరడానికి ఎవడికి నోరు వస్తుంది తల్లీ ! రాజ్యం గతించినా సరే లోకం నశించినా సరే ప్రభువువారు అటువంటి ప్రసక్తి తీసుకు రాని

స్తారా, అమ్మా! పోనీ, చావుకి తెగించి అటువంటి సల హాతో వారి ఎదర పడదామూ అంటే, మరో చిక్కొచ్చింది. మహారాణి వాసవదత్తవంటి ధర్మపత్ని ఉదయన మహా రాజుకి ఉంటూండగా, తన సోదరిని ఉదయనుడి కియ్యడం అసంభవం పొమ్మని నిష్కర్షగా చెప్పేశాడు దర్శకుడు. అందుకని, ఒప్పుగోండని మీతో చెప్పడానికి మనసొప్పడం లేదూ, మీరు కోరినా సరే ప్రభువు ఒప్పుగోరూ, ప్రభువు ఒప్పుగున్నా సరే ఆ పక్షం వారు పిల్లనియ్యరూ! ఇయ్యక పోతే బాంధవ్యం లేదు. బాంధవ్యం లేకపోతే సాయం రాదు. సాయం లేకపోతే, మనకి రాజ్యం నిలవదు.

వా—రాజ్యక్షేమం మాత్రమే మనస్సులో పెట్టుగునే తమబోటి మంత్రులు అరుదు. అమాత్యా! మీకు వంద నాలు, తమసమస్య నాకు బోధపడింది, మహాత్మా! ఇప్పుడు చెప్పండి తమ పన్నాగం. నేను ప్రతి అక్షరం ఆచరిస్తాను.

యౌ—పన్నాగం ఒకనాటకమే, మహారాణీ! ప్రభువూ తామూ నేనూ రుమణ్వంతుడూ వసంతకుడూ కొద్ది పరి వారమూ విహారం బయల్దేరడం, లావాణక ప్రాంతంలో విడిదిచెయ్యడం, ప్రభువుని వేటకని పంపడం, వారి పరో క్షంలో విడిది గృహానికి నిప్పంటించడం. ఆ దారుణాగ్నిలో తమరు అదృశ్యులైనా రనడం, మీ రక్షణకోసం పరిగెట్టి నేను అందులోపడి కాలిపోయా ననడం, ప్రభువు రాగానే

వారు మరేమీ అఘాయిత్యం చెయ్యకుండా మంత్రి రుమణ్వాంతుడూ మిత్ర వసంతకుడూ వారిని ఓదార్చడం.

వా—అయ్యో! అందుకు ప్రభువు ఎంత బాధ పడతారో!

యౌ—మీరు ఎంత బాధపడాలో! ఎన్ని శరీరాలూ ఎన్ని మనస్సులూ బాధపడందే రాజ్యక్షేమం దక్కుతుందా తల్లీ? బాధ తప్పించడం ఎవరి తరం?

వా—వసంతకా! మీరు ప్రభువుని ఓదార్చగలరా?

వ—ఏం చెప్పను తల్లీ! నా బుద్ధి యావత్తూ ప్రయోగిస్తాను. ప్రభువువారు సత్యం ఎరక్క బాధపడతారు, తక్కిన వాళ్ళం సత్యం ఎరుగుండి బాధపడతాం. కాని, నేనూ రుమణ్వాంతుడూ ఇద్దరంకదా! ప్రభువుతో మేమిద్దరం ఏదో తంటాలు పడతాం.

యౌ—తంటాలుపడి ఓదార్చడమే కాదు, వారు తిరిగి వివాహం చేసుగోడానికి సంసిద్ధంగా ఉండేలాగ వారిని మీరు తయారు చెయ్యాలి. వారికి పత్నీవియోగం వచ్చిందనేవార్త తెలియగానే, తన చెల్లెల్ని చేసుగో వలిసిందని దర్శకుడు వారికి రాయబారం పంపుతాడు.

వా—సరే, అమాత్యా, ప్రభువుతో వారు తంటాలు పడతారు, ప్రభువుమాట సరి. నా మాట! మరి, నేను యథార్థంగా మరణించను గనక, నే నెక్కడ దాక్కోనూ? నా గతేమిటీ? నిజంగా మరణిస్తే నయమేమో!

యౌ—అమ్మా అమ్మా! ఎంత మాట అన్నారూ! నేను కోరుతూన్నది సర్వజన శ్రేయస్సని తమరు నమ్మి కటాక్షిస్తారనే నమ్మకంతో తమతో ఇంతవరకు మనవిచేసు గున్నాను. కటాక్షించకపోతే, ఆగిపోతాను.

వా—అమాత్యా! ప్రభువుగారి యెడల నా భక్తి విశ్వాసాలు ప్రకటించడానికి నేనుకూడా నా ప్రాణం అయినా సరే అర్పించడానికి అన్నానే కాని, మరొక ఉద్దేశం నాకు లేదు. మీ పన్నాగంలో నా భాగంకూడా చెప్పండి.

యౌ—నేను తపసివేషం – ఇందాకటిది, ధరిస్తాను. తమరు మునికన్య వేషంధరించి జలజ అనే పేరుతో నా చెల్లెలుగా ఉంటారు. నేను తమర్ని తీసుగుని వెడతాను.

కా—తీసిగెళ్ళి కాశీలో దింపండి.

యౌ—కాదు, తల్లీ! నేనే కాశీ వెడుతూన్నట్టున్నూ, ఒక సంవత్సరంలోగాని తిరిగి రాలేనన్నట్టున్నూ, అంత వరకూ నా చెల్లెలైన మిమ్మల్ని తమ దగ్గిర పెట్టుగోడం నాకు చాలా సదుపాయం అన్నట్టున్నూ ప్రార్థించి, మిమ్మల్ని, ఆ దర్శక రాజు చెల్లెలు పద్మావతి దగ్గిరే అప్పగిస్తాను.

వా—అది మరీ చిక్కేమో?

యౌ—అది తమకి మరీ బాధేమో అని నాభయంగాని, ఇతరత్రా ఏమీ చిక్కులులేని స్థలం అదొక్కటే! తమరు పద్మావతి దగ్గిరుంటే, ఈ కాలం అంతా మీరు ఎక్కడ ఉన్నారో అనే శంక ప్రభువు వారికి కలగనే కలగదు, వారు

వియోగ బాధ పడినా చివరకేనా సందేహరహితమైన సంతోషం పొందగలుగుతారు.

వా—సరేకాని, అమాత్యా! నన్ను పద్మావతి దగ్గిర ఉండగా ఎవరేనా పోల్చుగుంటే?

యౌ—అమ్మా! ఇందాకా మీరు నన్ను పోల్చుకో గలిగారా? మీరెంత మునికన్య వేషంలో ఉన్నా మీ స్వభావం గుర్తించి పద్మావతి మిమ్మల్ని మన్నించి తీరుతుంది. మిమ్మల్ని పోల్చుకోడానికి ఎరుగున్నవాళ్ళు ఉంటే కదా!

వా—ఎప్పుడూ ఉండరా?

య—ఉండకేం? ఏదో వ్యవహారం మీద కల్పించి అక్కడికి నేను ప్రభువుగారిని తీసుకు చక్కా-రానూ? పద్మావతిని వారు చూసేటట్టు చెయ్యనూ?

యౌ—నిజమే, మహారాణీ! ప్రభువువారు దర్శకుడి రాజధానికి వచ్చిఉన్నప్పుడు, వారి కంట మాత్రం మీరు పడకండి.

వా—అలా ఎంతవరకూ?

యౌ—అమ్మా, ఏం చెప్పనూ? దర్శకరాజు సాయపడి, శత్రుక్షయం అయి, మన క్షేమ స్థితి కట్టుదిట్టం అయే వరకూ కూడా మీరు అజ్ఞాతంలో ఉండడం కర్తవ్యం.

వా—మరి మోక్షం?

యశో—నేను తపసిగా వచ్చి నా చెల్లెల్ని తీసికెడతాను రమ్మనండి—అని కోరినప్పుడు.

వా—మంత్రిశేఖరా! ఇట్లా సర్వార్పణం చేస్తూన్న మీ యొక్క ఋణం నేనూ ప్రభువూ ఎట్లా తీర్చుగోగలం?

యశో—అమ్మా! మీరు నా హృదయావేదన బోధ పరుచుగుని, నాపన్నాగం ఆచరించడానికి సాహసించి, అంగీకారం ఇయ్యడమే ఇప్పట్లో నాకు మన్నన.

వా—వసంతకా! మీ ఋణం?

వ—అమ్మా! ఫలారాలు చేసిచేసి మీకే ఋణపడి ఉంటాను. ఆ లెఖ్ఖలన్నీ ఇప్పుడు తేల్చడం మొదలెడితే నాకే చిక్కు. ప్రస్తుతం ఊరుకోండి.

వా—అమాత్యా! అజ్ఞాతంలో తమరు ఎక్కడుంటారు?

యశో—ఏదేనా మఠంలో! మకాంపెట్టి, సంగతులు గ్రహిస్తూ ఉంటాను. అమ్మా, సెలవు. వందనం.

వ—తల్లీ, వందనం, సెలవు.

వా—(వాళ్ళకి నమస్కరిస్తూండగా)

(తెర)

—

# రంగం-2

[రెంపోతెర ఎవట, కు. ఎ. నించి ముందు కాలపేడీ, అతడివెనక కష్టంతో నడుస్తూ జలజా వస్తారు.]

యశో—(కు. ఎ. నించి వెనక నడకలో వస్తూ) రండమ్మా రండి. మిమ్మల్ని ఎంతదూరం నడిపించానో! మీకన్ను ఎండఎరగదు, మీకాలు మన్నెరగదు. అటువంటి మిమ్మల్ని నేను శ్రమపెట్టవలిసొచ్చింది.

వా—(కు. ఎ. నించి వస్తూ) నా శ్రమకేమిలెండి. ప్రభువు ఎట్లాఉన్నారో అని నా బాధ. ఇప్పుడిప్పుడే మీతో మాట్లాడి వెళ్ళినవాడు బాటసారి కానట్టున్నాడు?

యశో—బాటసారి కాడమ్మా, చారుడే, అతడు సంగతులు చెప్పివెళ్ళాడు. అనుకున్నప్రకారమే విడిది కుటీరం అంటించారట. లోగడే మనుషుల ఎముకలు కొన్ని అక్కడ ఉంచారట. సగం కాలిపోయిన మన దుస్తులు జాగర్త చేశారట, వీణ ఎక్కడో పారేశారట, రాజువచ్చి అగ్నిలో దూకబోయారట.

వా—(కళ్లు కప్పుకుని) అయ్యో!

యశో—కాని, రుమణ్వంతుడు వారికంటె ముందేదూకి వార్ని పట్టుకుని బయటికి నెట్టగా వసంతకుడు కాళ్ళు పట్టుకుని వార్ని ఆపేశాడట. ఎప్పటికప్పుడు వారిని మరిపించి మీ గురించిన ప్రసంగం రాకుండా వాళ్ళు జాగర్తపడు

తున్నారట. వసంతకుడు తనెంత భోజనప్రియుడైనా ప్రభువు భోజనం చేస్తేగాని తనూ చెయ్యనని పట్టుబట్టి వారు ఎంగిలి పడేటట్టు చేస్తున్నాడట. రుమణ్వంతుడికి నిద్రాహారాలే లేవుట.

వా—అమాత్యా! వారి మనఃక్షోభతో పోలిస్తే నా శరీరశ్రమ ఒక లెక్కా!

యౌ—నిజమే, మహారాణీ! వారు నిద్రేపోరుట, ఒక వేళ తప్పిజారి ఎప్పుడైనా ఓ కునుకుపట్టినా, స్వప్నంలో మిమ్మల్ని భావించి లేచి కూర్చుంటారుట!

వా—అయ్యో! ప్రభూ! ఉండకూడనట్టు మీరు ఉన్నారు, లేనేలేనట్టు నేనున్నాను. ఎక్కడి రాజకీయమో కదా!

(ఎ. ఎ. నించి "దార్లోంచి తప్పుగోండి, తప్పుగోండి" అని వినపడుతుంది.)

యౌ—అమ్మా! మనం నగరప్రాంతాలకి వచ్చాం. (అని, ఎ. ఎ. కి వెళ్ళివచ్చి) ఇదేదో ఆశ్రమంలా ఉంది. ఇక్కడకూడా జనాన్ని కేకలేసి తోలుతున్నారే! వల్కలాలు ధరించి, ఫలాలు తింటూ తపస్వులై యిక్కడకొచ్చి ఉండడం ఇల్లాంటి ఆజ్ఞలూ నిబంధనలూ వదుల్చుగోవాలనే కదా. ఎవడో భటుడు! అదృష్టంవల్ల ఉద్యోగస్తుడై పొగ రెక్కి కీచుకంఠంతో ఈ ఆశ్రమప్రశాంతత్వం భంగపరుస్తున్నాడు. పామరుల్ని ఆజ్ఞపెట్టినట్టే ఆశ్రమవాసుల్నీ పెడుతున్నాడు.

వా—(ఏ. ఎ. కి జరిగి చూసి) ఎవడండీ, జనాన్ని అట్లా అదరకాయించి పారేస్తున్నాడూ?

యా—వాడాండి! మార్గంలోంచి జనాన్ని తరిమేసి, తను ఋజుమార్గంలో లేని సంగతి ఋజువుచేసుగుంటూన్న ఉద్యోగి.

వా—వాడిల్లావచ్చి నన్నూ తప్పుగోమంటాడా?

యా—ఏంచెప్పను, తల్లీ! ఆకారంమాత్రమే చూసి ఆంతర్యం తెలుసుగోలేనప్పుడు దేవతలైనాసరే తూలి నాడుతూనే ఉంటారు, అల్పులు.

వా—నాకు ప్రయాణబాధకంటె ఇటువంటి వంచనే ఎక్కువబాధ.

యా—ఈ స్వల్పాలకి నొచ్చుగోకండి. వేషాడంబరమూ పటాటోపమూ వంటివి మీరు పూర్తిగా చూసేఉంటిరిగదా! ప్రభువువారి విజయంతో అవన్నీ మళ్ళీ చూస్తురుగాని. కాల గమనంతో అదృష్టచక్రం తిరుగుతుంది. సందులో బండి వెళ్ళేటప్పుడు చక్రపాకులు కిందివి పైకిపోవడం చూడచ్చు.

(ఎ. ఎ. నించి కంచుకివచ్చి, ఎదుమకే తిరిగి ఎవర్నో మందలిస్తూన్నట్టు, మాట్లాడాలి).

కం—(ఎ. ఎ. నించి వెనక్కి జరిగివస్తూ) ఎవరదీ! శంభ షరా! "దాన్లో లేవండి, తప్పుగోండి. ఏయ్, మిమ్మల్నే" అంటూ మోటుగా ఇక్కడ కుడా జనాన్ని గదమ కూడదు. ఇది ఆశ్రమం. మన ప్రభువు పేరు మలినం చెయ్యకూడదు.

ఆశ్రమ వాసులమీద ఆగ్రహావాక్యాలు తగవ్. అటువంటివి తప్పించుకోడానికే మహాత్ములు ఆశ్రమాల్లోకి వచ్చి ఉండడం.

యౌ—(వాసవదత్తకి సంజ్ఞచేసి కు. ఎ. వెళ్ళి ఉండమంటాడు)

వా—(కు. ఎ. కి వెడుతుంది).

యౌ—అయ్యా! ఆయన ఎవరోగాని జనాన్ని అట్లా ఈసడిస్తున్నారేం? తమరు చాలా వివేచనగలవారులా ఉన్నారు.

కం—అతడు సామాన్య భటుడు. నేను కంచుకిని మహాత్మా!

యౌ—ఏ రాజువద్ద, మహాశయా!

కం—దర్శకరాజు వద్ద.

యౌ—వచ్చినవారు మీ మహారాజేనా?

కం—కాదు. మా ప్రభువుగారి సోదరి, పద్మావతీదేవి. తల్లిగారు వానప్రస్థంలో ఉండడంవించి, వారిని చూసి రావడానికి ఈమె వెళ్ళి వచ్చారు. తిరిగి నగరానికి వెడుతూ, ఒక దినం ఈ ఆశ్రమంలో గడపాలని ఆమె కుతూహలపడ్డారు. కాని, ఆశ్రమవాసులూ అతిథులూ కుడా ఏ విధమైన ఆటంకమూ లేకుండా, రాజసోదరి ఇక్కడ బసచేశారనే సంకోచం లేకుండా సమిత్కుశఫలాలూ జలమూ తెచ్చుగోవచ్చు. ఈమె ఆశ్రమ ప్రశాంత కృత్యాలు

చూడకుండా మరోటి ఏదీ కోరదు. ప్రజలలాగే ఈమె కూడా చట్టాలకి లోబడి ఉంటారు.

యౌ—చిత్తం, మీ రాజధాని?

కం—ఇక్కడే, రాజగృహం.

యౌ—అయ్యో!

కం—ఉండండి, వస్తాను. (అని, ఎ, ఎ, కి వెడతాడు)

యౌ—(తనలో) ఓహో! దైవానుకూల్యమే! ఈవిడే పద్మావతి, మగధయువరాణి, ఉదయనరాజుని పెళ్ళాడ గలట్టు పుష్పక భద్రకులచేత జోశ్యం చెప్పబడ్డ కన్య! ఆ జ్యోతిషం ధర్మంచూ అనే నేను ఎత్తులు వేస్తూంటా. ఎంత ఆశ్చర్యమో! కాస్సేపటి కిందట వీళ్ళ గర్వాలాపాలంటే నేను ఎంత మండిపడ్డానూ? నా కవ్వుడే ఆ కోపం పోతోంది. మన కోరికల్ని బట్టిగదా మన స్నేహద్వేషాలూ! ఈవిడ ఉదయనరాణి అయినట్టున్నూ వత్సరాజ్యాన్ని గట్టెక్కించి నట్టున్నూ అప్పుడేతోచి, ఈవిడమీద నాకు భక్తి బయల్దేరు తోంది, ఈవిణ్ణి చూడకుండానే. (అని, ఎ, ఎ, కి జరిగి చూస్తూ) అదుగో. ఒక వృద్ధురాలు ఆమెను దీవించి ఆమెకి స్వాగతం ఇస్తోంది. పద్మావతి తన కృతజ్ఞత తెలుపుతోంది. ఆ వృద్ధస్త్రీ మాటతో ఆమెకి చిరునవ్వు వస్తోంది. బహుశః వివాహ సంబంధ విషయం అయుంటుంది.

కం—(ఎ. ఎ, నించివస్తూ) అయ్యో! తమరు రావచ్చును (అని, ఎ, ఎ. కి వెడతాడు)

యౌ—(ఎ. ఎ. కే వెడతాడు)

(రెండో తెర లేవగా పద్మావతి ఉన్నతాసనం మీద కూర్చుని ఉంటుంది. ఎ. మ. నించి కంచుకి కాళవేదీ వస్తారు).

ప—కంచుకీ!

కం—అమ్మా!

ప—ఆశ్రమవాసుల్లో ఎవరికి ఏమి కోరిక ఉంటే అది నన్ను కోరుకోవచ్చును, అని అందరితోనూ చెప్పడం అయిందా?

కం—చిత్తం. అయినా, తృప్తిలేనివాళ్ళు ఇక్కడ లేనే లేరు గావును, ఎవ్వరూ ఒక్క కోరికా కోరుకోలేదు. కాని, అమ్మా, ఈ తపస్వి ఒక అతిథి.

ప—అయినా సరే. వారితోకూడా చెప్పండి.

కం—చిత్తం. మునిసత్తమా! మగధయువరాణి, పద్మావతీదేవి మీరు ఏమి కోరుకుంటే అది మీకు సంతోషంతో ఇస్తారు. వీరి వ్రతం ఫలించడానికి అదీ వీరు పెట్టుకున్న నియమం. పాత్రలా, వస్త్రాలా, దక్షిణలా, మీచిత్తం. మీ కోరిక తీర్చడానికి వీరు తక్షణం అనుమతించడమే కాకుండా దానిని నెరవేర్చడానికి ఆజ్ఞకూడా చేసేస్తారు. చెప్పండి. ఏమి కావాలి? మీరు మీ కోరిక ప్రకటించడమనేది వీరి యెడల మీరు చూపే దయగా వీరు భావిస్తారు.

ప—కోరండి, మునిసత్తమా!

యౌ—ఒక చిన్న ఉపకారం మీరు చేసిపెట్టాలి.

ప—అవశ్యం. చెప్పండి.

యా—(కు. ఎ. కి చూపిస్తూ) ఇక్కడే నా సోదరి ఉన్నది. ఆమె పేరు జలజ. ఆమె భర్త దేశాంతరంలో ఉన్నాడు. నేను దూరప్రాంతం వెళ్ళి తీరవలి సొచ్చింది. నేను మళ్ళీ వచ్చి ఈమెను తీసిగెళ్ళేదాకా ఈవిణ్ణి మీ దగ్గిర పెట్టుగోవాలి. నేను కోరేది ధనమూ కాదు కనకమూ కాదు, వస్తువూ కాదు వాహనమూ కాదు. అందువల్ల, నాకోరిక మీకు కొంచెం విరుద్ధంగా కనపడవచ్చు. కేవలం బతుకు తెరువు నిమిత్తం సన్యసించిన బాపతు కాదు నాది. ఈ యువరాణి బుద్ధిశాలినీ గుణవంతురాలూ గనక నాసోదరి ఈమె చేతులో క్షేమంగా ఉండగలదు.

కం—సరి సరి. ఇదేం కోరికండోయ్ ! ధనం ఇచ్చెయ్యొచ్చు, తపస్సు ధారపొయ్యొచ్చు, ప్రాణాలుకుడా సమర్పించి ఊరుకోవచ్చు. కాని, అప్పగించిన వ్యక్తిని గురించి జాగర్తపడడం దుర్ఘటం. ఇందుకు మనం ఎట్లా ఒప్పుకోగలం, యువరాణీ ?

ప—అదేమన్నమాట, కంచుకీ ! ఏదైనా సరే కోరుకోండని మొదట ఘోషణచేసి, తీరా కోరుకున్న తరవాత మనం ముఖాలు చూసుగోడం ఉచితమా ? అయ్యా, తమ సోదరిని తీసుగురండి.

యా—(కు. ఎ. వెళ్ళి అప్పుడే జలజని తీసుగు వస్తూ) ఇదుగో, నా సోదరి. ఈమెను మీరు ప్రాణప్రదంగా చూసుగోవాలి. మీ ఔదార్యానికి ఎంతో కృతజ్ఞుణ్ణి.

ప—అట్లాగే. ఈ క్షణంనించి ఈమె పూచీ నాదీ! జలజా, రా. మీ అన్నగారు వచ్చేవరకూ నువ్వు నాతో ఉందుగాని.

వా—(పద్మావతి కేసి జరుగుతుంది)

యౌ—(జలజతో) సోదరీ! నా అదృష్టంవల్ల నువ్వు సరియైన చోట ఉండబోతున్నావు. ఇక్కడికి సగంపని అయింది. ఇక నా పని నేను చక్కపెట్టుగుని సకాలంలో వస్తాను నిన్ను తీసుగుని వెళ్ళడానికి. అమ్మా సెలవు, అయ్యా సెలవు.

[అని కు. ఎ. కి వెళ్ళబోతూండగా, కు. ఎ. నించి
ఒక విద్యార్థి వస్తాడు]

వి—(కు. ఎ. నించి వస్తూ) అబ్బబ్బబ్బ! నిస్త్రాణ వస్తోంది. ఎక్కడ విశ్రమించను? ఇదేదో ఆశ్రమంలా ఊరుకుంది. అబ్బ! బెదరకుండా మేసే లేళ్ళు, శ్రద్ధాపేక్షల్తో పెంచబడే వృక్షాలు, ఫలపుష్పాలతో మూలిగే కొమ్మలు, దూడల్ని చూసుగుని మురిసే కపిల గోవులు, నాగేటి చాలెరగని విశాల భూములు! అబ్బ! (అని పైకి చూస్తూ) నల్లమేఘాల పందిళ్ళువేసే హోమధూమా లయుంటాయి! (కంచుకిని చూసి) ఆశ్రమం కాదా ఏమిటి చెప్మా! (అని, నడిచి పద్మావతీ వాసవదత్తల్ని చూసి) రాణివాసం వారు కూడా ఉన్నట్టున్నారే!

కం—భయంలేదు, రండి. ఆశ్రమంలోకి అంతా స్వేచ్ఛగా రావచ్చు. (అని పక్కనించి నీరు తెచ్చి) అయ్యా, కూర్చోండి. దాహం పుచ్చుకోండి.

వా—(జంకి. సర్దుకుని, వెనక్కి అంగ వేస్తుంది)

ప—భయంలేదు జలజా! పరాయివ్యక్తి ఒక విద్యార్థే! అంత భిడియం అవసరంలేదు. ఇంత పిరికి దాన్ని జాగర్త పెట్టడం గురించి మూకు భయమూ అవసరం లేదు.

యౌ—అయ్యా! తమరెవ్వరు?

వి—(కూచుని, దాహం పుచ్చుగుని) నేను ఒక విద్యార్థిని.

యౌ—తమరాక ఎక్కణ్ణించి, పోక ఎక్కడికి? తమదే గ్రామం?

వి—నా స్వగ్రామం రాజగృహం. ఇటీవల వేదాధ్యయనం నిమిత్తం లావాణక గ్రామంలో ఉంటున్నాను.

యౌ—మీ అధ్యయనం పూర్తి అయిందా?

వి—ఇంకా లేదండి.

యౌ—మరి వచ్చేశారేం?

వి—అక్కడ మహాదారుణం ఒకటి జరిగిందండి.

యౌ—ఏమిటి నాయనా అదీ?

వా—(భయపడుతుంది).

వి—ఉదయను డనేరాజు అక్కడ మకాం చేశాడు. అవంతిరాజు కూతురు అతడి రాణి. ఆమెమీద ఆయనకి

గాఢప్రేమ. ఒక నాడాయన వేటకి వెళ్ళగా, వారి కుటీరం నిప్పంటుగుని, ఆరాణి అగ్నికి ఆహుతి అయిపోయింది.

యౌ—అయ్యో!

వి—ఒక మంత్రిట, యౌగంధరాయణుడు, ఆవిణ్ణి రక్షించడానికని మంటల్లోదూకి తనూ భస్మమై పోయాడు. వేట నించి రాజు తిరిగి వచ్చి, రాణీమంత్రుల మరణాలు విని, తనూ పోదల్చి ఆ చిచ్చులో దూకబోయాడు. ఆయన్ని వారించడం అక్కడున్నవాళ్ళకి బ్రహ్మాండం అయిపోయింది. ఆవిడ ధరించే దుస్తుల్లో కొన్ని సగం కాలినవి మిగలగా, వాటిని హృదయానికి హత్తుగుని ఆయన మూర్ఛిల్లి పడిపోయాడు.

వా—(కళ్ళ నీళ్ళు పెట్టుగుంటుంది)

ప—జలజా! పర బాధల సంగతి వినేసరికే ఏడుస్తున్నావే?

కం—పాపం, ఈమె హృదయం ఎంత కోమలమో!

యౌ—మీరు సరిగా పోల్చారు. నా సోదరి హృదయం నవనీతం. నీ కథ కానీ బాబూ!

వి—కథ కాదు, మునివర్యా! కళ్ళతో చూశాను. క్రమేణా రాజుకి తెలివి వచ్చింది.

ప—పోనిండి, పాపం, దైవకృపవల్ల ఆయన జీవించే ఉన్నారుగదా, ఆయన మూర్ఛిల్లిన సంగతి వినగానే నా హృదయం శూన్యమైపోయినట్టు తోచింది క్షణంక్రితం.

యౌ—చెప్పు బాబూ!

వి—రాజుకి స్పృహవచ్చి నేలమీద దొర్లిపోయారు. బాధతో, 'హా వాసవదత్తా, అవంతిరాజపుత్రీ, హృదయప్రియా, ప్రియవిద్యార్థినీ' అంటూ కేకలుపెట్టి ఆయన విలపించారు. ఏ చక్రవాకంగాని ఏ గంధర్వుడుగాని తన ప్రేయసికోసం అంత విలపించినట్టు వినం. భర్తచేత అంత మనసారా ప్రేమింపబడే కాంత ఎంతధన్యురాలో! ఆవిడ కాలిపోతేం మాయం అయితేం. భర్తహృదయంలో కణకణలాడుతూ స్థిరంగాఉంది.

యా—సరేగానండి, మరెవ్వరూ ఆయన్ని ఓదార్చనే లేదూ ?

వి—ఓదార్చకేమండీ! రుమణ్వంతు డనే మంత్రి ఉన్నాడు. ఆయన రాజుని ఓదార్చడానికి పడని శ్రమంటూ లేదు. రాజే ఆయనలోకం. కన్నీళ్ళతో ఆయన చెక్కిళ్లు గాడిపడ్డాయి. రాత్రింబగళ్లు దుఃఖిస్తూ, రాజు ఏ కళలో ఉన్నా, రాజుని అంటే ఆయన ఉంటున్నాడు. తన స్థితీ తన వేషమూకుడా ఆయన చూసుగోడంలేదు. ఒకవేళ రాజు మరణిస్తే, మంత్రి అంతకిముందే మరణించేశాడన్న మాట.

వా—(విచారంతో) పాపం, ఎంతప్రభుభక్తిగలమంత్రో!

యా—నిజమేనండి. చచ్చిపోయినమంత్రే అదృష్టవంతుడు. రాజుగారి సమక్షంలో ఉండవలసొచ్చిన మంత్రియొక్క భారం మరీఎక్కువ. రాజపరోక్షంలో విశ్రాంతికి

వీలుగాని, రాజసమక్షంలో-అందులో వారి ప్రస్తుతస్థితిలో_ ఉన్న మంత్రియొక్క పనిభారం అనుక్షణమూ వ్యక్తిని కుంగదీసేస్తుంది. సర్వమూ ఆమంత్రిఒక్కడే చూసుకోవాలి. రాజుగారు తేరుకున్నారా. మహాత్మా!

వి—నాకు బాగా తెలియదండి. మంత్రీ ఒక బ్రాహ్మడూ కలిసి రాజునివెంటబెట్టుకుని పోయారు. రాజుగారు! 'ఇక్కడ మేంకలసి నవ్వుకున్నాం, ఇక్కడ ప్రసంగించాం, ఇక్కడ కూచున్నాం, ఇక్కడ ప్రణయకలహంలోపడ్డాం, ఇక్కడ రాత్రంతా గడిపేశాం, ఇక్కడ సరసని ఉండిపోయాం.' అంటూ కేకలు. రాజు వెళ్ళిపోగానే ఊరుశూన్యంఅయింది—చంద్రతారకలు డుల్లిపోయిన ఆకాశంలాగ. నేనక్కడ ఉండలేక వచ్చేశాను.

ప—ఆహా! ఆ రాజెంతటి ఘనుడో ఎంతటి సుగుణవంతుడో—పరాయివాడైన ఈవిద్యార్థి చూచివచ్చి ఇంత బాధతో సంగతి చెప్పగా విని మనం ఇంత బాధ పడుతూన్నప్పుడు!

కం—యథార్థం యువరాణీ! యథార్థం. అయినా, కాలం దుఃఖాన్ని లొంగదీస్తుంది. అప్పుడాయన వివాహసంకల్పం చెయ్యొచ్చు, యువరాణీ!

వి—వీరు యువరాణే! శీఘ్రమే వివాహసిద్ధిరస్తు!

ప—వీరికి భోజనంఏర్పాటు చేయించండి, కంచుకీ! అనంతరం వారుకోరేది అడుగుదాం.

కం—చిత్తం.

యౌగ—సోదరీ! ధైర్యంగా ఉండమ్మా! నేను తిరిగివచ్చే సరికి, దైవం తల్చుగుంటే, నీభర్తకూడా నీకోసం పరితపిస్తూ ఉండవచ్చు. (పద్మావతితో) అమ్మా! సెలవు. (అని కు. మ. కి వెళ్ళిపోతాడు.)

కం—వీరి సంగతి ఏర్పాటుచేసి మనం నగరం చేరు కోవాలి, యువరాణీ!

ప—సరే. (అని లేచి, ఎ. మ. కి పోతూండగా, ఆమెను వాసవదత్తా కంచుకీ అనుసరిస్తూండగా)

(తెర)

---

## రంగం-3

[ఉపవనం, ఎవైనా లతలూ మొక్కలూ ఉండాలి. పద్మావతి ఎ. ఎ. నించి వస్తుంది].

ప—(ఎ. ఎ. నించి వస్తూ) జలజా!

జ—(ఎ. ఎ. నించి వస్తుంది.)

ప—నేను ఆడుతూన్న బంతి (ఎ. వె. సూచిస్తూ) అల్లా దొర్లింది, తీసుకురా.

జ—ఎ. వె. కి వెడుతుంది.)

ప—(ఆభరణాలు సర్దుకుని మొహం తుడుచుగుంటుంది).

జ—(ఎ. వె. నించి వచ్చి బంతి ఇస్తుంది.)

ప—ఇంకా కొంచెంసేపు ఆడతాను. (అని ఆడడానికి ఉద్యుక్తం అవుతుంది.)

జ—అబ్బో మీరు చాలా సేపణ్ణించి ఆడుతున్నారు, యువరాణీ! చూడండి, మీ చేతి వేళ్ళు ఎల్లా కంది పోయాయో, పారాణిపెట్టే పెళ్ళికూతురు వేళ్ళులాగ!

ప—ఎప్పటి ముచ్చట అప్పుడూ! తరవాత సాగు తుందా ఈ ఆట?

జ—ఆ మాట సరే. కాని, మీరు ఆయాసంతో వగ రుస్తున్నారుగా!

ప—అయితే మానాను. కాని, నువ్వు నాకేసి ఏమి టంత తదేక దీక్షగా చూస్తున్నావు? నేను అసందర్భంగా ఉన్నానా, అసందర్భంగా వర్తిస్తున్నానా?

జ—అబ్బే, ఊరికేనే, మీరిప్పుడు మరీ ముద్దొస్తున్నారు. మీ ముద్దు మొహం అన్ని దృక్పథాల్నించీ చూసి ఆనం దిస్తున్నాను.

ప—ఆః నన్ను ఎగతాళి చేస్తున్నావ్!

జ—అయితే మరి మాటే అన్ను, నాకెందుకు! పైగా మహాసేనరాజుకి కోడలు కాబోతున్నావు గావును కుడానూ!

ప—మహాసేన రాజెవరు, జలజా!

జ—ప్రద్యోత మహాసేనుడు, ఉజ్జయినిరాజు. విస్తారమైన సేన గలిగి ఉండడంచేత ఆయన్ని మహాసేను డంటారు. ఆ సంబంధం......

(ఎ. మ. నించి గబగబా మల్లిక వస్తుంది.)

మ—(ఎ. మ. నించి వస్తూ) ఆ సంబంధం ఈమెకి ఇష్టం లేదు, జలజా !

జ—అయితే మరి ఏ సంబంధం ఇష్టం ?

మ—ఉదయనుడనే వత్సరాజుగారి సుగుణాలు విన్నప్పటి నించీ ఈమె వారిని గురించిన వ్యామోహంలో పడిపోయింది.

జ—ఔరా ! ఎందుకో ఆ వ్యామోహం ?

మ—ఎందుకేమిటీ ? వారి బుద్ధిసూక్ష్మతా హృదయ కోమలత్వమూ ఈమెని ఆకర్షించి ఉంటాయి. కాని, పద్మా వతీదేవీ ! ఉదయనుడు అందవికారంగా ఉంటే ?

జ—అబ్బే, ఆయన చాలా అందకాడు.

ప—నీకెట్లా తెలుసు, జలజా ?

జ—అయ్యో ! ఉజ్జయినిలో ప్రతినోటా అదేమాట !

ప—అల్లానా ! అవును. ఉజ్జయిని యొక్క జనానికి ఆయన్ని చూడడం కష్టంకాదుగా ! అందం అందర్నీ లాగే స్తుంది. అందాన్ని విమర్శించని వాడే ఉండడు.

మ—అమ్మా ! పద్మావతీ ! ప్రసంగాలు ఎందు కొచ్చిన పనీ ! మీా పెళ్ళిమాటలు అయినాయి. పెళ్ళికొడుకు ఉదయన రాజు. వారు అంగీకరించారు.

జ—ఆసి మల్లికా ! చెప్పవేం మరీ ఇందాకణ్ణించీ ?

మ—చెబుతున్నానుగా ! ఉదయనుడు అంగీకరించారు.

జ—ఇది సమంజసంగా లేదు.

మ—ఎందు చేత ?

జ—గతించిన రాణికోసం ఆ వరసని వాపోయే రాజు, ఇంత త్వరగా ఆవిణ్ణి విస్మరించి, పెళ్ళికి సిద్ధపడడం అసమంజసం.

మ—ఒస్, అదా ! కాని, ఆయన మహాత్ముడు. అటువంటివారు గీతల్లో చెప్పినప్రకారం ఆచరించి, క్షణంలో పుట్టుగొచ్చే అపారదుఃఖాన్ని మరుక్షణంలో జయించేస్తారు.

జ—అలా దుఃఖాన్ని జయించి, వారే పంపించారుగావును రాయబారం !

మ—లేదు. పనిమీద వారు రాజగృహానికి రాగా, దర్శకరాజే వారికి పద్మావతిని ఇస్తానన్నారు—గొప్ప వంశమూ, విశేషపాండిత్యమూ, నవయవ్వనమూ, కోమల సౌందర్యమూ ఆయనలో మూర్తీభవించాయిమరి. (పద్మావతితో) అమ్మా, ఉండి. ఈ వేళ చాలా మంచిది గనక మిమ్మల్ని ఈ వేళే పెళ్ళికూతుర్ని చెయ్యాలిట; (అని, ఎ. మ. కి వెడుతుంది)

ప—(లేచి) జలజా, రా. (అని ఎ. మ. కి నడుస్తుంది)

జ—వస్తున్నా పదండి. ఈ పూలదండ గుచ్చడం పూర్తిచేసుకుని వస్తాను. (తనలో) ఔరా ! నా ప్రభువు మరో స్త్రీని వివాహం చేసుగోడానికి ఏర్పాట్లన్నీ నా చేతిమీదుగా జరిగి సంగతులన్నీ నేను ప్రత్యక్షంగా గమనిస్తూన్నా, నా మనసుకి ఆందోళన తప్పలేదు కదా ! జరిగి

సట్టు తెలిసిన సంగతులకి నా ప్రభువుని ఏమీ అనడానికి లేదు. కాని, వీళ్ళంతా ఎవో సంబంధాలనీ, కాదు ఉదయనుడే పెళ్ళికొడుకనీ, కాదు ఇప్పుడే పద్మావతిని పెళ్ళికూతుర్ని చెయ్యాలనీ పడే తొందర ఎక్కువవడం నేను చూస్తూన్నకొద్దీ నా హృదయంలో అంధకారం దట్టం అవుతోంది. ఎట్లాగో పద్మావతిని ఇక్కణ్ణించి వెళ్ళబెట్టి, ఉత్సాహంలో మునిగి తేలే వాళ్ళని వొదుల్చుకుని, ఈ ఏకాంతంలో విధి నాకు తెచ్చిపెట్టిన సంతాపాన్ని దిగ మింగుకోడానికి యత్నిస్తున్నాను. అయ్యో! ఎంత దుర న్యాయం! నా భర్త మరొక స్త్రీకి భర్త అవుతున్నాడే! జంట నించి విడిపడ్డ చక్రవాకం ధన్య, అది తక్షణం మర ణించేస్తుంది. నే నల్లాంటి ఘటాన్నో గాని, నా చావు నేను కోరుకోడానికేనా వీల్లేకపోయింది. భర్తని మళ్ళీ చేరుకో గలనేమో అనే ఆశే నా ప్రస్తుత జీవితానికి ఆధారం. అయ్యో! నే నెంత అజ్ఞానురాల్ని! విధినీ అమాత్యుణ్ణీ ఏమనను? నేనే కదా ఇదంతా కోరుకున్నదీ! మరణించడం సులువు, ప్రతికూలశక్తుల్ని ప్రతిఘటించుతూ జీవించడమే దుష్కరం! సత్సంకల్పంతో ప్రజాక్షేమం యోచించి ఈ వన్నాగానికి ఒప్పుకున్నాను. రాజ్యక్షేమం సిద్ధించాలంటే రాజదంపతుల హృదయ క్షోభలు తప్పవా, దైవమా! (అని, దండగుచ్చడం నటిస్తూ ఉంటుంది.)

మ—(వి. మ. నించి వస్తూ) మమ్మల్ని సాగనంపి, ఈ జలజ ఏదో దీర్ఘాలోచనలో పడ్డట్టుంది—చంద్రవంక ధూమ రాశిలోలాగ! (పైకి) జలజా!

జ—(ఉలిక్కిపడి) ఆఁ, ఏమిటి కథ?

మ—ఈ పత్రాలూ పుష్పాలూ కుడా నీ చేతి కిమ్మన్నారు.

మ—ఎవరు?

మ—పెద్దరాణీగారు. జలజ అయినింటి ఇల్లాలు, మంచి నేర్పరి, మరికిష్టురాలు గనక ఆవిడ చేత పెళ్ళి దండ గుచ్చింపించి పట్టుగురమ్మన్నారు.

జ—ఆహా! ఇంతమంది ఉంటూండగా పద్మావతి పెళ్ళి దండ గుచ్చాలని పెద్దరాణీగారు నన్నే కోరడం ఎల్లా ఉండాలో అల్లాఉంది.

మ—నీ ఆంతర్యం అల్లాంటిది, జలజా!

జ—నా ఆంతర్యం సంగతే నే చెబుతూన్నది.

మ—అయితే యింకేం? ఇవి పుచ్చుగో. (అని పత్రాలూ పుష్పాలూ ఇస్తూ) నీ చేతులో ఉన్న దండలో ఇవి కూడా అక్కడక్కడ గుచ్చేయ్, త్వరగా కానీ!

జ—ఏమంత తొందర?

మ—తొందర కేముందీ? సుముహూర్తమూ ఇప్పుడేట. పెళ్ళికొడుకుని మంగళాస్నానాలు చెయించారు. వారు అలంకరణశాలలో ఉన్నారు.

జ—నువ్వు చూశావా పెళ్ళికొడుకుని ?

మ—ఆ.

జ—ఎల్లా ఉన్నారు ?

మ—చెఱకు విల్లూ పుష్పబాణమూ లోటు.

జ—చాలు, అంతటితో ఆగు.

మ—అదేం ? అల్లా ఆగిపొమ్మంటావేం ? అబద్ధమనా ?

జ—కాదు. మరొకరి భర్తగురించిన స్తోత్రాలు వినడం స్త్రీకి అనుచితం. (తనకిచ్చిన పత్రాల్లో ఒకటి తీసి మల్లికకి చూపిస్తూ) ఈ పత్రం పేరేమిటే ?

మ—పతిభద్రం.

జ—అయితే, ఇది చాలా విరివిగా వాడతాను.

మ—ఏం ?

జ—ఏమూ ! నీకా గొడవలేదుగాని, పద్మావతికీ నాకూ భర్తవిషయం ఉమ్మడేకదా ! (మరొకపత్రం చూపిస్తూ) దీన్నేమంటారూ ?

మ—శత్రు వినాశి.

జ—ఇది విరివిగా వాడను.

మ—ఏం ?

జ—వాసవదత్త గతించింది గనక, పద్మావతికి శత్రువు ఎవరున్నారూ నాశనం కావడానికి !

మ—అబ్బ ! ఈ పాటికి ముత్తైదువలు వచ్చేసుంటారు.

ఈ దండకోసం మళ్ళీ కబురంపుతారేమో! రా, జలజా పోదాం!

జ—అయితే నడు! (అని ఎ. మ. కి నడుస్తూండగా)

(తెర)

---

## రంగం-4

[రాజగృహనగరం. కోటలో ఉపవనం. అక్కడక్కడ తిన్నెలు, ఎ. మ. నించి వసంతకుడు ప్రవేశిస్తాడు]

వ—(ఎ. మ. నించి పొట్ట చేత్తోపట్టుకుని ఊత్తూన్నట్టు వస్తూ) అబ్బ, అబ్బ! నా ప్రభువు ఉదయనరాజుగారి వివాహ మహోత్సవ సమయంలో నేనుండడం నా పుణ్యం. దుర దృష్టపు సుడిగుండాల్లో అర్థ మునక్కపోయి, మళ్ళీ పైకి తేలి, గట్టెక్కుతామని ఎవడనుకో గలడూ! మేం మళ్ళీ అంతః పురాల్లో ఉంటూన్నాం, కోటలోపలి చెరువుల్లో స్నానాలు చేస్తూన్నాం, నవకాయ పిండివంటల్తో భోజనాలు ఆర గిస్తూన్నాం. స్వర్గతుల్యంగా జీవితం ఉంటోంది, కాని ఎటొచ్చీ గంధర్వ కన్యలు వెంటలేరు. ప్రస్తుతస్థితిలో పెద్ద చిక్కు ఒక్కటంటే ఒక్కటే వచ్చిపడింది. అదేమిటంటే, తిన్నది బొత్తిగా అరక్కుండా వచ్చింది, దీని మొహం

ఈడ్చా! హంసతూలికా తల్పంమీద పడుకొంటూన్నా కంటికి ఇల్లా ఒళ్ళుకునుకు రాదే! ప్రతీ కీలూ పట్టేస్తోంది. భోజనానికి సరిపడ్డ నిద్రా వాటికి సరిపడ్డ ఆరోగ్యమూ లేనప్పుడు జీవితంలో సౌఖ్యం ఏముంటుంది, నా మొహం!

మ—(ఎ. మ. నించి వస్తూ) ఏమయ్యా!

వ—(కళ్ళు మూసుగునే ఉండి) ఎవరదీ?

మ—నేనే. కళ్ళు కనిపించడం మానేశాయా?

వ—మరే, నేనే మానేసెయ్యమన్నాన్లే. మల్లికవా?

మ—మరే.

వ—కంఠం అల్లానే ఉందిలే.

మ—అందాకా భోంచేసిన వారికి తెలిసేది అదే.

వ—ఎంత బాగా అంటివే లతాంగీ! నాతో నీకు పనేమిటే?

మ—రాజుగారి స్నానం అయిందా? వారికి పువ్వులూ తిలకమూ పట్టికెళ్ళి ఇయ్యాలి.

వ—ప్రభువువారి స్నానం అయింది. తినుబండాలు మాత్రం వద్దు, మరేమిటైనా సరే. నువ్వు పట్టికెళ్ళి వారికియ్యొచ్చు.

మ—తినుబండాలు వద్దక పోవడేం?

వ—నా కర్మం ఏం జెయ్యమన్నావ్? నా పొట్ట అదే తిరగడం అదే తిరగడం, కోకిల కళ్ళులాగ.

మ—తథాస్తు! మీ పొట్టా మీరూ తిరుగుతూ ఉండండి. మీకు నేను ఏమీ పట్రాలేదు.

వ—నువ్వే వచ్చినప్పుడు ఇంకా నువ్వు వేరే పత్రావడం ఎందుకులే !

మ—మీ కిప్పట్లో చూపు లేదుగా ! మళ్ళీ వస్తాలెండి.

వ—ఛీ పో. రాజుగార్ని కలుసుగోవాలి (అని, కు. మ. కి పోతాడు)

(ఎ. మ. నించి పద్మావతీ జలజా వస్తారు)

ప—(ఎ. మ. నించి వస్తూ) మల్లికా ! శేఫాలిక విడిచిందేమో చూడు.

మ—(ఎ. వె. కి వెళ్ళివచ్చి) ఆ, విడిచింది. ఆ పువ్వులు ఒక్కొక్కటి పగడాలు తాపిన ముత్యంలా ఉన్నాయి.

(పద్మావతీ జలజా ఒక తిన్నెమీద కూర్చుంటారు),

మ—(పువ్వులు తెచ్చి పద్మావతి ఒళ్ళో పోస్తుంది)

ప—(పువ్వులుచూస్తూ) ఓహోహో ! ఏమి కాంతీ, ఏమి రంగులూ, ఏమి పరిమళం ! మరి కొయ్యకు. ప్రభువుగారు ఇటు వచ్చేసరికి పువ్వులు కొయ్యకుండా మొక్కలమీద ఉంటూన్నప్పుడే ఎక్కువ ఆనందిస్తారు.

జ—దేవీ ! తమకు ప్రభువారి యెడల ప్రేమ అపారంలా ఉందే !

ప—నిజమే జలజా ! నా ప్రేమని తిన్నగా ప్రకటించడానికి నా వాక్కు చాలదు. వారి సామీప్యం కానిచోట నేను ఉంటూన్నప్పుడు నాకు ఉసూరుమని పిస్తుంది. నేను వారిని ప్రేమించేటంత గాఢంగా, ఆ వాసవదత్త ప్రేమించేదో లేదో నాకు సందేహం.

జ—నాకు సందేహం లేదు.

ప—అంటే ?

జ—వాసవదత్తే మీకంటె ఎక్కువ గాఢంగా ప్రభువుని ప్రేమించుండి ఉండాలి.

ప—ఏమో ! ఆ సంగతి నిర్ణయించడానికి నువ్వెవరవ్ ?

జ—అబ్బే ! ఊహిస్తున్నాను. వాసవదత్త ప్రేమ ఎంత మహోత్కృష్టమైందీ కాకపోతే, ఆమె స్వజనాన్ని విడనాడి ఆయనతో లేచిపోవడానికి ఏనుగు నెక్కుతుందా ?

మ—(పద్మావతితో) పోనీ, దేవిగారూ ! తమకి కూడా వీణ వాయింపు ఇష్టమే అని ప్రభువు వారితో అని చూడక పోయారా ?

ప—సరే. అనడమూ అయింది, వారు పెద్ద నిట్టూర్పు పుచ్చి మూక్కి ఊరుకోవడమూ అయింది.

మ—అంటే అర్థం ఏమిటి దేవీ ?

ప—వాసవదత్తనీ ఆవిడ సుగుణాల్నీ ప్రభువు తల్చుకున్నా రన్నమాట.

మ—ఆవిణ్ణి అల్లా మీ యెదటకూడా మెచ్చుతూ మిమ్మల్ని నిరసించెయ్యడం ఎంత వంచనో చూడండి.

ప—అల్లా అనకు మల్లికా ! వాసవదత్త సుగుణాలు ప్రభువు స్మరించడంలో వాసవదత్త మహిమా ప్రభువు వారి త్రికరణశుద్ధీ కూడా ద్యోతకం అవుతున్నాయి.

జ——రాణీ! మీరు జనించిన మహావంశానికి మంచి ముత్యంలా ఉంది మీ సమాధానం.

మ——సరేగాని, (పైకి చూస్తూ) చూడండి చూడండి, ఆ పక్షులు తోరణంలాగ, ముందుకి పోతున్నాయి.

జ——మరోటి వస్తోంది, కేవలం పద్మహారం లాగ!

ప——ప్రభువు వచ్చేవేళ అయింది. నడవండి. మనం వెళ్ళి ఆ మల్లెకుంజంలో కూచుందాం.

జ——రాణీ! మీరు రండండి. మేం వెళ్ళిపోతాం. ప్రభువు వచ్చేస్తూన్నప్పుడు మే మెందుకూ?

మ——రానియ్యండి, వచ్చినా వారు మల్లెకుంజంలోకి రాకుండా ఓపని చేస్తాను. మధ్యమార్గంలో పూలతీగెలున్నాయి. అవన్నీ కదిపేస్తాను. తేనెటీగలు చెలరేగి మనుష్యుల్ని పట్టుగుంటాయి. అటు ఎవ్వరూ రారు.

ప——సరే. కదిపిరా, మనం ఇల్లా (కు. ఎ. చూపిస్తూ) వెడదాం. లేకపోతే అవి మన్ని పట్టుగుంటాయి.

మ——(కు. వె. వెళ్ళి వచ్చి) వాటిని బాగా రేగకొట్టేశాను. మనం పోదాం రండి.

ప——(కు. ఎ. కి వెళ్ళబోతూ వెనక్కి తిరుగుతుంది)

వా——(కళ్ళు తుడుచుగుంటుంది.)

మ——చూశారా, రాణీ! ఈ జలజ ఎందుకో గాని ఏడుస్తోంది.

జ——(మళ్ళీ కళ్ళు తుడుచుగుని) అబ్బే, ఏమీలేదు. నువ్వు తీగెలు కదపగానే తుమ్మెదలు రేగి కాశపుష్పాల

పొడి గాలికి కొట్టుకొచ్చింది గావును, నా కళ్ళనిండా పడింది. నడవండి. (అని, కు. ఎ. కి వెడుతుంది)

ప—(కు. ఎ. కి వెడుతుంది.)

మ—(కు. ఎ. కి వెడుతుంది.)

[ఎ. మ. నించి ముందు వసంతకుడూ, అతడి వెనకాల ఉదయనుడూ వస్తారు]

వ—(ఎ. మ. నించి వస్తూ) ఆహా! ఈ ఉపవనం ఎంత రమణీయం!

ఉ—(ఎ. మ. నించి నెమ్మదిగా వస్తూ) వసంతకా! పూర్వం ఉజ్జయినిలో చెరసాల ఎదుట నేను వాసవదత్తని చూడగానే పంచబాణుడు తన బాణాలన్నీ నామీద వేశాడు. మధురమూ తీవ్రమూ అయిన ప్రేమ నా చెవులలో మోగి నా హృదయాన్ని కబళించింది. కాని, నా దుఃఖం పెంచడానికి ఈ ఆరో బాణం అత డెక్కడ సంపాదించాడో గదా!

వ—సరే సరే, పద్మావతీదేవి మాటా! ఆవిడ ఎక్కడికి వెళ్ళిందో! లతాకుంజం దగ్గిరికో, లేక శైలాగ్రం అనే పేరుతో తిన్నె ఉందే, పులిచర్మంలాగ, అక్కడికో, లేక దట్టంగానూ ఘాటుగానూ వాసనకొట్టే సప్తపర్ణి వనం లోనికో, లేక గోడలమీద పశుపక్ష్యాదుల చిత్రాలుగల దారు భవనానికో! (పైకి చూస్తూ) అట్లా చూడండి,

ప్రభూ! శిశిరర్తు స్వచ్ఛాకాశంలో మహావేగంతో పోతూన్న ఆ కొంగల పంక్తిని!

ఉ—అవును. అద్భుతంగా ఉంది. ఆ పక్షుల గమనరేఖ ఇట్టె అవిచ్ఛిన్నంగా ఉంది, ఇట్టె తెగిపోయింది. ఒకసారి వాటి గమనం ఊర్ధ్వముఖం, మరొకసారి అధోముఖం. ఈ పక్షులరేఖ ఆకాశాన్ని ద్విధాకరించింది. కూసం విడిచిన పాం యొక్క పొట్టలాగ ఆకాశం నిర్మలంగా ఉంది. ఒక్కొక్కప్పుడు పక్షులు గిరున తిరిగి మళ్ళీ సర్దుకుని సప్తమహర్షి నక్షత్రకూటాన్ని స్ఫురింపచేస్తున్నాయి.

వ—ఇట్లా కూచోండి, ప్రభూ!

ఉ—(తిన్నె మీద కూచుంటాడు.)

వ—(ఇటూ అటూ పరికించి) రాజా! పద్మావతీదేవి ఇప్పుడిప్పుడే ఇక్కడ కూచుని వెళ్ళి ఉండాలి.

ఉ—అదెట్లా చెప్పగలవ్?

వ—శేఫాలికా పుష్పాలు ఇప్పుడిప్పుడే కొయ్యబడ్డట్టున్నాయి గనక!

ఉ—(రాతి తిన్నె తాకి చూసి) నీ మాట నిజమే. జనం ఎవరో కూచుని ఇప్పుడే వెళ్ళిన తార్కాణగా ఈ స్థలం వెచ్చగా ఉంది. (కింద కొన్ని పువ్వులు చూసి) ఈ పువ్వులు తొక్కినట్టు కనిపిస్తున్నాయి. ఎవరో క్షణంక్రితం ఇక్కడ కూచుని ఉండి, మనం వస్తూండడం గమనించి ఉడాయించారు. ఓహో! వసంతకా! ఈ పువ్వుల రంగు ఎంత

ప్రకాశవంతమో చూడు! మనం ఇక్కడే కూచుందాం, పద్మావతి వస్తుంది.

వ — సరి సరి. ఈ రాతి తిన్నె వేడి మనిషి వేడి కాదయ్యా, ప్రభూ! ఎండ వేడి. ఆ మల్లెకుంజాలో విశ్రమించుదాం, రండి.

ఉ — అయితే, నడు

వ — (కు, వె. కేసి వెళ్ళి అప్పుడే వస్తూ) బాబోయ్, బాబోయ్! (అని ఒళ్ళు నిమురుకుంటూ) చంపేశాయ్, తెకుక్కుట్టేశాయ్, తేనెటీగలు! అల్లా వెళ్ళనీకుండా అవి మనిషిని అటకాయించేస్తున్నాయ్!

ఉ — అరెరె! వాటిని ఏమీ అనకు. వాటిని బెదర కొట్టకు, అవి రేగితే, అంటుకుట్టేస్తాయి. అంత మధురంగా గానం చేసే మధుకరుల్ని మనం తొక్కడం కుడా దోషమే. కొన్ని జంటలుగా ఉంటాయి, ఆ జంటల్ని విజ్జోడు చెయ్య కూడదు. అవి తేనెతప్పతాగేసి పేమగ్రస్తలైన తమ ప్రేయ సుల్ని మమకారంతో లాలిస్తూ ఉంటాయి. ఈ రాతి తిన్నె మీదే కూచుందాం, రా (అని, కూచుంటాడు.)

వ — ఈ ప్రమదావనంలో ఇప్పుడు మనం తప్ప మరె వరూ లేరుగదా. ఓమాట మిమ్మల్ని అడగాలని ఉంది, అడగనా?

ఉ — అడుగు మిత్రమా, నీ కిష్టముంటే!

వ—అయితే అడుగుతా పట్టండి. మీకు మరీ ప్రేమ వెనకటి వాసవదత్తమీదా, లేక ఇప్పటి పద్మావతి మీదా ?

ఉ—నన్ను అసందర్భపు స్థితిలో దింపుదామనా నీ కోరిక ?

వ—ఇందులో అసందర్భత్వం ఏముందీ ? వెనకటి ఆవిడ గతించింది, ఇప్పటావిడ ఇక్కడ లేదాయె ! అందుకని సంకోచం లేకుండా చెప్పండి, రాజా !

ఉ—చెప్పను, మిత్రమా, చెప్పను. ఎంతమాత్రమూ చెప్పను. నువ్వు కేవలం వాగుడుకాయివి.

వ—మీరు చెప్పేది నేను మళ్ళీ ఒక్ఖపిట్టకేనా చెప్పనని సత్యప్రమాణిక్యం చేస్తున్నాను. ఇదుగో నాలిక కరుచు గుంటున్నాను, చూడండి.

ఉ—చెప్పను, వసంతకా ! నాకు ధైర్యం లేదు.

వ—ఇంత వాజమ్మలాగ బలవంతం చేస్తున్నాడేమిరా అనుకుంటున్నారేమో, రాజా ! నీ హృదయం నాకు తెలుసు. మీరు గనక చెప్పకపోతే, మీరు ఈ రాతి తిన్నె విడిచి వెళ్ళ వల్లకాదు. మీకు ఖైదు వేసేశాను.

ఉ—నిన్నే నువ్వు తిట్టుగుంటూ బలవంతాన్నా చెప్పించడం ?

వ—అవును బలవంతాన్నే.

ఉ—అయితే సరే చూద్దాం, చెప్పను.

వ—అబ్బె బ్బే. ఊరికే అన్నాను. నా పొగరు మన్నించండి, రాజా! మన స్నేహం సాక్షిగా, యథార్థం చెప్ప వలిసిందిగా మిమ్మల్ని మరీ మరీ ప్రార్థిస్తున్నాను, రాజా!

ఉ—ఇప్పుడు మరీ చిక్కు తెచ్చిపెట్టావే! ఏమిటిదారి! సరే, మరి విను. పద్మావతి అందమూ శీలమూ మాధుర్యమూ చూసి ఆవిణ్ణి చాలా ఎక్కువగా గణిస్తాను. కాని, వాసవదత్త నా హృదయానికి అధికారిణి. వాసవదత్త నేను దుఃఖించినప్పుడు దుఃఖించి, ఆనందించినప్పుడు ఆనందించేది. నా హృదయంలో తీవ్రమైన బాధ ఉన్నప్పుడు, నేను దాన్ని పైకి ఫలానా అని ప్రకటించ జాలకపోయినా, విన్నావా, నా అప్రకటిత బాధ గుర్తించి తనూ బాధ పడేది. నేను క్రోధంలో పడ్డప్పుడు, తియ్యటి పలుకుల్తో నా క్రోధాన్ని ఉపశమింప చేసేది. వసంతకా! వాసవదత్త నాకు భార్య, నేస్తం, దాసి, వెయ్యికళ్ళతో నన్ను కని పెడుతూండిన మంత్రి. సరి. ఇక్కడికి నా అభిప్రాయం నీతో చెప్పాను. ఇక నీవంతు. నీ అభిప్రాయం చెప్పు. నువ్వు ఎవర్ని ఎక్కువ మన్నిస్తావ్, పురాతన వాసవదత్తనా, నవీన పద్మావతినా?

వ—విలవ శూన్యం అయిన నా అభిప్రాయం ఏమైతేం పోనిస్తురూ! నేను ఇద్దరు రాణుల్నీ కూడా చాలా ఎక్కువ ఆదరంతో వీక్షిస్తాను.

ఉ—ఛీ, శుంఠా! నా అభిప్రాయం చెప్పేవరకూ నా ఎముకలు కొరుక్కు తిన్నావు. ఇప్పుడు నీ అభిప్రాయం చెప్పను పొమ్మంటావే?

వ—ఏమిటి రాజా మీ మాటా? బలవంత పెడతారా, నన్నుకూడా?

ఉ—అవును, సహజంగా.

వ—అయితే కాస్కోండి. నన్ను చంపేదాకా చెప్పను. తరవాత మీకు అసలే లాభం ఉండదు.

ఉ—అయితే క్షమించు, మహానుభావా, మహాశయా! నీకు ఇష్టం అయితేనే చెప్పు.

వ—అయితే వినండి, రాజా! పద్మావతీరాణి యువతి, సుందరి, శాంత, స్వాతిశయమూ క్రోధమూ లేనిది, చాలా ఆరిందాతనం తెలిసినది. వాసవదత్తకీ ఉండేవి ఈ లక్షణాలన్నీ! కాని, వీటి నన్నింటినీ మించిన సుగుణం ఒకటి ఉంది, ఆసుగుణం వాసవదత్తదగ్గిర అతి విస్తారంగా దొరికేది. అదేమిటండీ అంగ్రలు! వెండి పళ్ళేరాల్లో వేడి మిఠాయిలు పట్టించుకుని 'ఏడండీ మహానుభావుడైన ఆ వసంతకుడూ' అని కేకలు వేసుకుంటూ వైభవంగా వచ్చేది, వాసవదత్త!

ఉ—సరే, వసంతకా! ఇల్లా అన్నావని చెబుతాలే వాసవదత్తతో.

వ—వాసవదత్తతోనా! సరి సరి. వాసవదత్త ఎక్కడుందీ! ఎంతకాలం అయిందో ఆవిడపోయి!

ఉ—హా! వాసవదత్తా! నాకు నువ్వు లేకపోయావు గదా! వసంతకా! నీ సంభాషణవల్ల నా మనస్సు వెనకటి కాలంలో విహరించి ఆవిడ జీవించే ఉన్నదని అనుకోగా, నా పెదవులు అభ్యాసబలంచేత ఆవిడపేరు ఉచ్చారణ చేసేశాయి.

వ—ధైర్యం అవలంబించండి, రాజా! విధి ఎవరు తప్పించగలరూ? జరిగింది యావత్తూ, అట్లా ఏర్పాట్లు, చేసేశారా అన్నట్టు జరిగిపోయింది. అంతకంటె మనం మరేమి చెయ్యగలం ఇప్పుడు?

ఉ—మిత్రమా! హృదయాన్ని కదిలించిన ప్రేమ ఎవడు మరిచిపోగలడూ? వెర్రి జ్ఞాపకం వెనక్కి వెళ్ళి ఆ ప్రేమనిధిని తవ్వుకొచ్చి చూపించగానే వర్తమానంలో ఉలిక్కిపడతాం, దుఃఖిస్తూండే మనస్సులు తాకట్టుపడి ఉంటాయి. సరిపడ్డ కన్నీళ్ళతో వెనకటి బాకీ రద్దుచేసు కున్నప్పుడుగాని, అల్లాంటి మనస్సులు తెరిపిని బడవ్! (అని ఏడుస్తూ మొహం చేతుల్లో దాచుగుని వంగుతాడు)

వ—(తనలో) పద్మావతి వచ్చేసరికి ప్రభువు ఇల్లా ఉండ కూడదు. మొహం సుబ్భరంగా కడుక్కోవాలి. వెళ్ళి కాసిని నీళ్ళు తెస్తాను; (అని ఎ, మ, కి వెడతాడు)

(అప్పుడు పద్మావతీ, జలజా, మల్లికా—ముగ్గురూ కుడా కు. మ. కి వస్తారు. ప్రభువు దుఖంలో ఉన్నప్పుడు వారిని పలకరించడం భావ్యంకాదని జలజ పద్మావతికి సంజ్ఞచేసి, తనూ మల్లికా లోపలికి వెళ్ళిపోతాం అనిన్నీ పద్మావతి మాత్రం అక్కడే ఉండాలనిన్నీ బోధపడేటట్టు నటించి, ఎ. ఎ. కి వెళ్ళిపోవాలి).

ప—(రాజు కేసి నడుస్తుంది).

వ—(ఎ, మ, నించి తామరాకులో నీరు తెస్తూ, రాణికి ఎదురౌతాడు)

ప—ఏమిటదీ ?

వ—(కంగారుపడి) ఇదా అదే! అహాఁ హాఁ అదా ఇదే!

ప—తిన్నగా చెప్పండి, మహాత్మా!

వ—తిన్నగా చెబుతాను వినండి; (అని, సకిలించి) ఇప్పుడు, మన ఈ, కాశపుష్పా లున్నాయాండీ, కాశ పుష్పాలూ! వీటిపొడి ఎగిరి రాజుగారి రెండు కళ్ళల్లోనూ కలికం వేసినట్టు పడింది. దాంతో వారికి కళ్ళంట నీళ్ళు ప్రవహిస్తున్నాయి. ఇయిగో నీళ్లు. మీరు ఇవి తీసిగెళ్ళి వారికిస్తే వారు కాస్తంత మొహం కడుక్కుని ప్రజల్లో పడతారు.

ప—ఓహో! వీర ప్రభువుకి తగ్గ వీరభృత్యుడు! తెండి. (అని, ఆ నీరు తీసుగుని, ఉదయనుణ్ణి సమీపించి) జయం జయం ప్రభువు వారికి! ఇదుగో నీరు. మీ మొహం శుభ్ర పరుచుగోండి.

వ—మహాప్రభూ! మరేమీ లేదు. తన ప్రేమ నిధికి ఏమి భంగం వస్తుందో అని స్త్రీ హృదయానికి ఎప్పుడూ తహా తహే. ఈ యువతి ధైర్యవంతు రాలేగాని. నూతన వివాహిత. మీ కన్నీళ్ళకి కారణం ఏమూ అని బాధ పడుతూన్నారు.

ఉ—ఒస్. కళ్ళనీళ్ళా? ఈ కాశపుష్పాల పొడి రేగి నా కళ్ళల్లో పడింది.

ప—శక్కిన అందరి కళ్ళల్లోనూ పడకపోవడం ఆశ్చర్యమే ప్రభూ!

వ—రాణీ! ఆశ్చర్యాలకేం? ఒకొక్కప్పుడు ఆశ్చర్యాలు మామూలుగానే జరిగి పోతూంటాయి. ప్రభూ! మగధరాజు ఇప్పుడు మీ గౌరవార్థం స్నేహితుల్ని ఆహ్వానించి విందుచేస్తున్నారు. తమరు కటాక్షించి తక్షణం లేవకపోతే ఇబ్బంది.

ఉ—సరే, (అని లేస్తూ) వస్తాను. దేవీ! భూమిమీద గొప్ప సుగుణాలూ ఘనమర్యాదలూ గలవాళ్ళని కలియడం తేలికే, చాలామంది ఉంటారు; కాని, ఆ సుగుణ మర్యాదలకి సరియైన విలవ కట్టగలవాళ్ళని కలుసుగోడం తేలిక కాదు—అటువంటి వాళ్ళెందరో ఉండరు. (అని, ఎ. మ. కి పోతూండగా—)

(తెర)

---

## రంగం-5

[రెండో తెర ఎదట. కు. ఎ. నించి ముందు వసంతకుడూ వెనకాల ఉదయనుడూ వస్తారు.]

వ—(కు. ఎ. నించి వస్తూ) రండి, ప్రభూ! పద్మావతీ రాణి కోటలోని సాగరకుటీరంలో ఉన్నారు.

ఉ—ఎప్పటి నించి ఆమెకి తలనొప్పి?

వ—పొద్దుణ్ణించీ గావును.

ఉ—ఎవరు చెప్పినవారు?

వ—మల్లిక.

ఉ—ఎవరికి కబురు చేశారూ?

వ—తెలియదు ప్రభూ! కథలు ఏవేనా చెప్పడానికి ఎవర్నేనా రమ్మన్నారేమో!

ఉ—మందు?

వ—మందూ తెస్తార్లెండి. మనం వెడదాం రండి, ముందు.

[అని, ఎ.ఎ. కి నిష్క్రమించగా, రెండో తెర లేస్తుంది. ఒక పక్కగా మంచం వేసి ఉంటుంది. ఎ. మ. నించి ముందు వసంతకుడూ వెనకాల ఉదయనుడూ వస్తాడు]

వ—(ఎ. మ. నించి వచ్చి ఇటూ అటూ తిరుగుతాడు)

ఉ—(ఎ. మ. నించి వచ్చి తనలో) వివాహ సముద్రం మీద నాటి రెండోయానం. నా ఆలోచనలన్నీ వాసవదత్త గురించే! వాసవదత్త—అవంతి రాజపుత్రి, నా ప్రియ భార్య, నా ధర్మపత్ని, లావాణకం దగ్గిర అగ్నికి ఆహుతి అయిన నా అర్ధాంగి, ఆకలి తీరని తన నాలిక చివర మృత్యువుని ధరించే క్రూరహిమంచేత హతమార్చబడిన మొగ్గ.

వ—త్వరగా రండి, రాజా!

ఉ—(తనలో) అమ్మో! సౌందర్యమూ విధేయతా కూడా గల పద్మావతితో వివాహం జరిగిన మీదట సంతాపం కొంత ఉపశమిస్తుందనుకున్నాను. ఒక విషం మింగి ఉన్న వాణ్ణి గనక పద్మావతి అనారోగ్యం అంటే హడలుగాఉంది.

వ—(మంచం పక్కకి నడిచి) బాబోయ్, రక్షించండి, రాజా! ఈ పాటి వెనక్కి దారట్టండి. అక్కడ ఓ పాం పడుకుంది.

ఉ—(అటు నడిచి చూసివస్తూ) అబ్బే! అది పైనించి పడ్డ పూలమాల! అలంకారంగా పైన కడితే గాలికి తెగి కిందపడింది గావును. ఓయి మూర్ఖపండితుడా! ఇదా పాం?

వ—(దాన్ని అతి జాగర్తగా పరిశీలించి) మరే నండోయ్! పాం ఎంతమాత్రమూ కాదూ! పూలదండ లాగే ఉంది. అసలు, పూలదండే, తీరా చూస్తే!...ఇందు వల్ల పద్మావతీదేవి ఇక్కడికి వచ్చి ఆగి వెళ్ళి ఉండాలి.

ఉ—అబ్బే! ఇంకా వచ్చుండదు. పక్క చెరగలేదు, దుప్పటీ రేగలేదు, తలగడా నలగలేదు, తలకి రాచుకు నుండవలిసిన మందు యొక్క డాగు ఎక్కడా పడలేదు, రోగి యొక్క దృష్టిని మళ్ళించగల వస్తువేదీ ఇక్కడలేదు, జబ్బువాళ్ళు పక్కమీదినించి లేచిపోయి ఇంత త్వరలో తచ్చాడుతూండరు.

వ—అల్లాయితే ఓక్షణం ఈ పక్కమీదే కూర్చోండి, రాణీగారి కోసం నిరీక్షింతాం.

ఉ—(పక్కమీద కూచుంటూ ఆవలించి) మిత్రమా! నాకు కళ్ళుమూసుగు వస్తున్నాయి. ఏదేనా కథ చెప్పు దయచేసి.

వ—ఓ. చెబుతా కాస్కోండి.

ఉ—(పడుకుని, కళ్ళు మూసుగుంటాడు)

వ—అనగనగా

ఉ—ఊఁ

వ—ఉజ్జయిని అనే నగరం.

ఉ—ఊఁ

వ—ఆ నగరంలో రమణీయంగానూ స్నానార్హంగానూ ఉండే సరస్సులున్నాయి.

ఉ—(మత్తుగా) ఉజ్జయినా, అన్నావ్?

వ—పోనీ ఉజ్జయిని మీ కిష్టం లేకపోతే పీడాపోయిరి, మరోటి చెబుతాను—కరువొచ్చిందా తడుముకోవాలా!

ఉ—(నిద్రలోనో మెలుకువలోనో తెలియకుండా) అబ్బెబ్బే! నా కిష్టం లేకపోలేదు. కాని, 'ఉజ్జయినీ' నగరం అనడంతోటే,—అవంతి రాజపుత్రి స్ఫురిస్తుంది—జనం యెడల ఆమె ఆపేక్షా, మేం ఏనుగులమీద వచ్చేసేటప్పుడు ఆమె దుఃఖం, నా వక్షంమీద ప్రవహించిన ఆమె కన్నీరూ, కపోతంలాగ ఆమె వణికిన వణుకూ, జ్ఞాపకం వస్తున్నాయి, మిత్రమా! నేను తనకి పాఠం చెప్పేటప్పుడు, ఆమె నాకేసి నిదానించి దృష్టి బాణాలతో నా హృదయ కుహరంలోని

భావాల్ని గుచ్చి బయటికి లాగేసేది. వీణ వాయించే టప్పుడు, తన చేతులోంచి దంతపుముక్క జారిపోగా, ఆమె చెయ్యిమాత్రం సాహృదయ తంత్రుల్ని మీటుతోందా అన్నట్టు ఆడుతూనే ఉండేది.

వ—సరే సరే సరే, ఆ గోషవద్దు. మరోకథ అందు కుంటా లెండి, పోనీ. అనగనగా: బ్రహ్మదత్తనగరం ఉందిట! ఆ నగరాన్ని కాంపిల్యరాజు ఏలుతున్నాడట!

ఉ—ఓయి మూర్ఖా! రెండూ తబ్బిబ్బులే! కాంపిల్య నగరం, బ్రహ్మదత్తరాజూనూ!

వ—పోనీ అల్లానేకానీ! కాంపిల్యనగరమే, బ్రహ్మదత్త రాజే!

ఉ—అక్షరాలా!

వ—అయితే ఉండండి, ఈ రాజువల్లా ఊరువల్లా రెండింటాలా కూడా దగాపడ్డాను. శాస్త్ర వల్లె వేస్తానుండండి. కాంపిల్యనగరం — బ్రహ్మదత్తరాజూ, కాంపిల్యనగరం— బ్రహ్మదత్తరాజూ, కాంపిల్యనగరం—బ్రహ్మదత్తరాజూ! ఇంక వీటిని మరవను. మరిచెబుతా వినండి. ఆ పళంగా ఏమైందనుకున్నారూ! ఏం? (అని, రాజుకేసి చూస్తూ) 'ఊఁ' అనరేమండీ? ఓయి దేవుడా! ఈయనకి నిద్ర కమ్మేసింది. పద్మావతి తలనొప్పి మందుకి మల్లిక వెళ్ళింది గనక, ఆ బాధలేదు. ఛలి చంపేస్తోంది. పోయి శాలువా యేనా తెచ్చుకుంటాను. (అని కు. మ. కి వెడతాడు)

ఎ, ఎ, నించి మల్లిక జటిజని తీసుగొచ్చి, మంచం చేసి చూపించి,
తను వెనక్కి వెళ్ళిపోతుంది),

జ—(తనలో) అయ్యో ! పద్మావతి తలనొప్పి బాధతో పడుకున్నట్టుంది. తలనొప్పి నిద్దట్లో సర్దుకుంటుంది, దేవతలకి నా మీద జాలి లేదుకద ! నా ప్రభువు పడే బాధ కొంతవరకు నివారిస్తూండే పద్మావతికి ఒంట్లో నసిగా లేదాయె. ఈ దాసీలకి ఎంత నిర్లక్ష్యమో ! ఈ విడకి సుస్తీగాఉన్నా ఓ గుడ్డి దీపం ఇక్కడపారేసి ఎవరి మట్టుకు వాళ్ళు తప్పుగున్నారు. ఈ విడ నిద్రలో ఉంది. నేను కూచుంటాను. నేను దూరంగా కూచుని ఉంటే, తన మీద నాకు తగినంత అంతఃకరణ లేదనుకుంటుందేమో ఈవిడ, పక్కమీదే కూచుంటాను. (అని, ఒక అంచున కూచుని) అయ్యో ! ఎమోగాని, ఇక్కడ కూర్చోగానే, నా గుండె కొట్టుగుని, నా ఒళ్ళుపులకరిస్తోంది. (పరున్న వ్యక్తినిచూస్తూ) శ్వాస సుళువుగా సక్రమంగా నిరాటంకంగానే ఉంది. తలనొప్పి తగ్గిపోయి ఉంటుంది. పక్కలో చిన్న భాగంలోనే తను సర్దుకుని, నన్ను వచ్చి కౌగిలించుగోమంటుందా అన్నట్టు ఎక్కువ భాగం తెరిపిగా ఉంచేసింది. పక్కని పడుకుంటాను. (అని పడుకోడానికి యత్నిస్తుంది)

ఉ—(నిద్రలో) అయ్యో ! వాసవదత్తా, వాసవదత్తా !

జ—(చటుక్కున పక్కమీంచి లేచి) అయ్యో ! నా నాధుడే ! పద్మావతి కాదు. వీరు నన్ను చూసుండ లేదుకద !

చూశారా, యౌగంధరాయణ మంత్రి యత్నం యావత్తూ భగ్నం అవుతుంది. ఏమంటే, నా నాథుడు నన్ను స్వీకరించక మానడు. పద్మావతి పెళ్ళి చెడిపోతుంది. దర్శకుడు సాయం చెయ్యడు. మా రాజ్యం మాకు దక్కదు.

ఉ—(నిద్రలో) అయ్యో! అవంతి రాజపుత్రీ!

జ—అమ్మ, నయమే! నా ప్రభువు స్వప్నావస్థలో ఉన్నారు. ఇక్కడ మరెవరూ లేకపోవడం కొంచెం అదృష్టమే అనాలి. ఒక్కక్షణం ఆగి, కళ్ళకి పండుగా హృదయానికి వేడుకా చేసుగుంటాను.

ఉ—(నిద్రలో) అయ్యో! ప్రేయసీ! ప్రియఛాత్రీ! నాకు సమాధానం చెప్పవూ?

జ—(సాహసించి) సమాధానం చెబుతున్నాను, నాథా, సమాధానం చెబుతూన్నది, నేనే, వాసవదత్తనే!

ఉ—నీకు కోపమా?

జ—అబ్బెబ్బే, ఏమీ కోపం లేదు. కొంచెం దుఃఖమూ అసౌఖ్యమూ అనుభవిస్తూన్నాను. అంతే.

ఉ—నామీద కోపం నిజంగా లేకపోతే, నీ ఆభరణాలన్నీ తీసేశావేం మరీ?

జ—(తనలో) స్వప్నంలో కూడా వారికి నేను నా ప్రస్తుత స్థితిలో కనిపించుతూన్నప్పుడు, వారి హృదయంలో నాకు ఎంత స్థానం ఇచ్చారనుకోవాలీ! ధన్యురాల్ని!

ఉ—(మత్తుగా) నీ కోపం, విరచిత అనే స్త్రీకీ నాకూ వెనక ఉండిన సంబంధం గురించా ?

జ—అవేం మాటలు ప్రభూ ! సిగ్గుకుడానూ ! ఇక్కడ కూడా ఆ విరచిత గొడవే !

ఉ—(చేతులుచాస్తూ) అయితే, విరచిత గురించి నన్ను క్షమించు.

జ—(తనలో) ఇక్కడ చాలాసేప్పణ్ణించి ఉన్నాను. ఏక్షణంలోనైనా ఎవరైనా రాగల్రు. మరి చాలు. నే పోతాను. నాథుడి చెయ్యి వేళ్ళాడుతోంది. అది సరిగా పెట్టేసి వెడతాను. (అని, చెయ్యి సరిగా పెట్టి ఎ. వె. కి వెళ్ళిపోతుంది.)

ఉ—(చటుక్కున పక్కమీంచి లేచి) ఆగాగు ! వాసవదత్తా ! ఆగు ! (అంటూ తొందరగా కు. మ. కేసి నడిచి ద్వారబంధం తలకి కొట్టుగున్నట్టు ఆగి) స్, అబ్బ ! (అని, కళ్ళు తెరిచి) ఏమిటిదీ ! నేను వాసవదత్తని నిజంగా చూశానా, కల్లో చూశానా ? ఆశ్చర్యంగా ఉందే ! ఏది స్వప్నావస్థో ఏది జాగ్రదవస్థో తెలియడం లేదే !

వ—(కు. మ. నించి వస్తూ) తెలియకేం ? ప్రభువువారు జాగ్రదవస్థలోనే ఉన్నారు,

ఉ—మిత్రమా ! శుభవార్త. వాసవదత్త సజీవ. ఇప్పుడిప్పుడే చూశాను. తన సౌందర్యాయుధంతో నా హృదయదుర్గాన్ని ముట్టడించి, నయన ద్వారంగుండా ప్రవేశించి అప్పణ్ణించీ ఇక్కడే ఉంది.

వ—అయ్యో! వాసవదత్త! ఇంకా ఎక్కడ వాసవదత్త, రాజా! వాసవదత్త గతించి చాలాకాలం అయింది కాదా, రాజా!

ఉ—అరె! (అని, నాలిక కరుచుగుని మెలుకువ బుజువు చేసుగుంటూ) అల్లా అనకు మిత్రమా! ఆమె ఇంత క్రితమే ఇక్కడికి వచ్చి నన్ను లేపింది, ఈ పక్కమీద నేను పడుకుని ఉండి నప్పుడు. తరవాత తుర్రుమంది. ఆమె మంటలో కాలిపోయిందని చెప్పి రుమణ్వంతుడు నన్ను ఇంతకాలమూ దగా చేశాడు, నువ్వూ దగాచేశావు. కాని, ఇప్పుడు సత్యం బయట పడ్డది. సర్పం దగ్గిర్నుంచి నేను నేర్చిన అక్షరతిలకం పద్మావతి నొసట నేను ఎప్పుడు చూశానో, అప్పుడే, "అవంతి కాంత సజీవ" అని నా హృదయం నాకు చెప్పింది.

వ—అయ్యో! మిత్రమా! అటువంటిది అసంభవం! ఒకవేళ మీకు అట్లా కలవచ్చిందేమో! ఇందాకా కాదూ, ఉజ్జయినీ, స్నానార్హమైన సరస్సులూ, అంటూ కథ చెప్పానూ! మీ మనస్సు తదేక ధ్యానంలో పడింది.

ఉ—అది నా కొచ్చిన కలే అయితే, అటువంటి కలలోనే నేనుండిపోతాను. కాక, అది నన్ను మించిన మాయ అయితే, ఆ మాయ శాశ్వతం కావాలని కోరుకుంటున్నాను. అటువంటి స్వప్నంలోంచి జాగ్రతలోకి గాని, అటువంటి మాయలోంచి యథార్థంలోకి గాని రాకూడదు.

వ—మీా రెరగరు గాని, మిత్రమా! ఈ ప్రాంతాన్ని ఒక గంధర్వజాణ ఆవహించి ఉందిట. ఒకవేళ అదిగాని మిమ్మల్ని రంగు చెయ్యాలని వచ్చిందేమో! మీారు భ్రమ పడ్డారో!

ఉ—అబ్బెబ్బే! నా మాట నమ్మి మిత్రమా! అదేదో నా బుర్రయొక్క పైత్యం కాదు. స్పష్టంగా తలకట్టుకి సంస్కారం లేకుండా, కోమల నేత్రాలకి కాటుక లేకుండా— అచ్ఛంగా, భర్తనించి ఎడబాసైన స్త్రీ ఎట్లా ఉండాలో అట్లా ఉంది. అదీకాక, ఈ చెయ్యి ముట్టుగుని చూడు. ఆవిడ పట్టుకుంది. ఇది యింకా రోమాంచితం అయే ఉంది చూస్కో.

వ—(నవ్వేసి) ఏముటో! అసందర్భంగా గుణకారాలు చేసి ఊహిస్తూ ఇంకా కూర్చోకండి, ప్రభూ! స్త్రీ సమా వేశం దగ్గిరికి వెళ్ళాలి, మనం. దయచెయ్యండి.

[కు. ఎ. నించి కంచుకి వస్తాడు]

కం—(కు. ఎ. నించి వస్తూ) జయము జయము ఉదయన రాజా!

వ—ఎవరదీ?

కం—నేను కంచుకిని. మా దర్శకరాజుగారి వద్దనించి ఒక విన్నపం.

ఉ—ఏమని!

కం—మీకు ప్రతికక్షుడైన ఆరుణిని అణచడానికి మీ మంత్రి రుమణ్వంతుడు ఒక గొప్ప సేనతో ఈ చేరువకే వచ్చి ఉన్నాడు. నా గజరథ తురంగ సేనాబలాలన్నీ సజ్జితం అయినాయి. కాబట్టి, తమరు కూడా దాడికి సిద్ధంగా ఉండండి. మీ శత్రువు భేదింపబడ్డాడు. మీ పక్షం వాళ్ళల్లో విశ్వాసం ప్రబలింది. మీ సేనకి వెనకతట్టు రక్షణ చేస్తూ నా సేన ఉంటుంది శత్రునాశనానికి ఎంత చెయ్యాలో అంతా చేశాను. నా సేనలు గంగానది దాటేశాయి. అచిరకాలంలో మీరు తిరిగి వత్సరాజులవుతారు—అని. సెలవు.

వ—ఇదీ సరియైన శుభవార్త. ఈ మాత్రం వార్త ఈమధ్య వినలేదు.

ఉ—మంచిది. కంచుకీ! దర్శకరాజుకి వందనాలు. గజ బృంహితాలూ తురంగ హేషలూ సముద్ర తరంగ ఘోష లాగ చెలరేగగా, బాణవర్షాలు కురిపిస్తూ, చెడి బతిగిన ఆ ఆరుణిరాజుని చీల్చి చెండాడతాను. కంచుకీ, వెళ్ళు!

కం—చిత్తం. (అని, కు. మ. కి వెడతాడు)

ఉ—(కు. మ. కి పోతూ) వసంతకా! పద!

వ—చిత్తం.

(తెర)

## రంగం-6

[కౌశాంబిలో ఉదయనరాజు నగరు. రెండో తెర ఎదట. ఎ. ఎ. నించి మల్లిక రావోతూంవగా, కు. ఎ. నించి బాదరాయణుడు చూస్తాడు.]

బా—(కు. ఎ. నించి వస్తూ) అమ్మా!

మ—(ఎ. ఎ. నించి వచ్చి ఉండి) ఎవరు?

బా—ఎవరి కీర్తి వత్సరాజ్య పునర్విజయంతో ఇనుమడించిందో ఆ ఉదయన రాజుకి ఈ సంగతి నివేదించండి. అంగారవతీ మహాసేనులు పంపగా బాదరాయణు డనే కంచుకి వచ్చి ద్వారంవద్ద వేచి ఉన్నాడు—అని.

మ—ఇటువంటి వార్త తీసుకువెళ్ళడానికి ఇది తరుణం కాదు.

బా—ఎందుచేత నమ్మా?

మ—ఏంచేతా! ఇక్కడ సుయమునాసౌధంలో ఈవేళ ఎవరో ఒక వీణవాయించారు. మహారాజు విని, అది నా ఘోషవతి ధ్వనిలా ఉన్నదే, అన్నారు. ఆమట్టున ఎవరో వెళ్ళి, 'ఇదెక్కడి దయ్యా నీకూ?' అని వాయించే వారిని కనుక్కున్నారు. 'నర్మద ఒడ్డున రెల్లు దుబ్బుల్లోపడి ఉంటే తెచ్చాను, ప్రభువువారికి దీని ప్రయోజనం ఏమన్నా ఉంటే పట్టిగెళ్ళి యిది వారి కియ్యండి' అన్నాడాయన. అది తెచ్చి రాజు కిచ్చారు. దాన్ని కౌగిలించుకుని, ఆయన మూర్ఛిల్లారు. స్పృహ వచ్చిం తరవాత కన్నీళ్ళతో మొహం అంతా

తడియగా, 'నవ్ కనిపించావ్ ఘోషవతీ, నువ్వు కని పించావ్, కాని, ఆమె కనిపించలేదుగదా నాకు' అని ప్రభువు వాపోయారు.

బా — నేను చూడవచ్చానని చెప్పి రావమ్మా, తల్లీ! నాపని కూడా అందుకు సంబంధించిందే!

మ — అయితే సరేనండి. వెళ్ళి చెప్తాను ప్రభువువారు సౌధం నించి తన మందిరానికి వస్తారు. (అని ఎ. ఎ. కి వెడుతుంది.) ఉండండి.

బా — (కు. ఎ కి వెడతాడు)

(రెండో తెర తేవగా, రాజుగారి మందిరం. ఉదయనుడు ఎ, మ. నించి వీణతో ప్రవేశిస్తాడు)

ఉ — (ఎ. మ. నించి నెమ్మదిగా వస్తూ) ఓహో! ఘోష వతీ! సునాదనిధీ! సౌందర్యమూర్తి అయిన ఒక రాణి వక్షం మీదా ఒళ్ళోనూ మెసిలిన దానివికదా, ఆవిణ్ణించి వేర్పడడానికి నీ కెల్లా మనస్కరించిందీ! పిట్టలు పాడుచేసే దుబ్బుల్లో నువ్వు పడి ఉండడం ఎల్లా సంభవించిందీ! నువ్వు సార్థకంగా కొయ్యఘటానివి ఘోషవతీ, లేకపోతే నువ్వు ఆ దురదృష్టవంతురాల్ని మరిచి ఉండగలవా? ఆవిడ తను నిన్ను మోసినప్పటి స్పర్శ, నీ చిత్తానికి హత్తలేదా? ఆమె అలిసినప్పుడు ఆమె వక్షం మీద నువ్వు ఉన్నప్పటి నీ ఆనందం ఏమైపోయిందీ? పాటాల మధ్య ఆమె మాటలూ,

ఆమె నవ్వేలూ, వెళ్ళిపోవలి వొచ్చినప్పుడు ఆమె బతిమాల డాలూ—సమస్తమూ నీకు మరుపే?

వ—(కు. మ. నించి వస్తూ) చాలుగాని, ప్రభువుగారు, ఈ దుఖ్ఖం ఇక తగ్గించుగోవాలిగాని, ఎక్కువ చేసుకోకూడదు.

ఉ—అల్లా అనకు మిత్రమా! నా దుఖ్ఖాన్ని నేను వృద్ధి చేసుగోడంలేదు. మొదణ్ణించీ ఉన్న దుఖ్ఖమే అల్లా ఉండి పోయింది. లోగడ లోపల నిద్రిస్తూండేది, ఈ వీణ కంట పడగానే, మేలుకుంది. కాని, ఈ వీణాంటే నా కళ్ళకి మళ్ళీ కనిపించిందిగాని, ఈ వీణనీ దీని నాదాన్నీ ప్రేమించే ఆ వాసవదత్త నాకు కనిపించలేదు. ఎవడేనా నేర్పరి అయిన వాడి దగ్గిరికి ఇది తీసిగెళ్ళి తంత్రులు బాగుచేయించి తత్షణం తీసుగురమ్మను.

వ—చిత్తం, తెండి. (అని వీణతీసుగుని కు. మ. కి వెడతాడు)

మ—(కు. ఎ. నించి వస్తూ) జయము జయము ప్రభువు వారికి!

ఉ—ఏమి, మల్లికా!

మ—అంగారవతీ మహాసేనులు పంపిన రాయబారంతో వారి కంచుకి బాదరాయణుడనే ఆయన ద్వారంవద్ద వేచి ఉన్నారు.

ఉ—సరే. వారిని పిలుద్దుగానిలే. ముందు వెళ్ళి పద్మావతీ రాణిని రమ్మను.

మ—చిత్తం. (అని ఎ. మ. కి వెడుతుంది).

ఉ—(తనలో) అసలే నా మనస్సు అస్థిమితం అయింది. ఇప్పుడు మహాసేన రాయబారం అంటే మరీ కలవర పడుతోంది. మహాసేనుడు చాలా కఠినమైన మాటలు పంపించాడేమో అని నాకు భయం వేస్తోంది. వారిని ఎంత క్షోభ పెట్టానో కదా! వారితో చెప్పకుండా వారి అమ్మాయిని లేవదీసుకు వచ్చాను, అప్పట్లో! ఇప్పుడు ఆమె దహనం అయిపోవడానికి కారణభూతుణ్ణయాను. నా ప్రజ్ఞలు నశించాయి, ప్రియరాణీ! అదృష్టం నన్ను దూరం చేసింది. తెలివితక్కువ పన్లుచేసి తండ్రికి దారుణకోపం తెప్పించే కొడుకు సామెతగా ఉంది, నా జీవితం.

ప—(ఎ. మ. నించి వస్తుంది).

ఉ—పద్మావతీ! రా, కూచో! నా సరసకి రా. అంగారవతీ మహాసేనుల సందేశం వినాలి.

ప—ప్రభూ! ఆ స్థానానికి నేను అర్హురాల్ని కాను. అయినా, నేను ఇది ఆక్రమించక పోవడం ఆ పూర్వరాణి యెడల తిరస్కారం అనేమాట రావచ్చుననే భయం చొప్పున, ఆక్రమిస్తాను. ఆక్రమించి, రాయబారం బాధతో వింటాను.

ఉ—యావత్తుబాధా పడడానికి నేనున్నాగా, పద్మావతీ! నేను పడిన మీదట బాధ అనేది ఏమున్నా మిగిత్తే అది నువ్వు పడుదువుగాని! ఆ రాజ దంపతులు వార్త మన

ఉభయులకీ పంపినప్పుడు ఉభయులమూ ఉండి అది వినడం ధర్మం, మర్యాద.

వ—ప్రభువువారి ఆజ్ఞ. కూచుంటాను.

(ఇద్దరూ పీఠాలు అలంకరిస్తారు)

ఉ—మల్లికా!

మ—(ఎ. మ. నించి వస్తుంది).

ఉ—మహాసేనుల రాయబారిని ప్రవేశపెట్టు,

మ—చిత్తం, ప్రభూ! (అని, కు. ఎ. కి వెళ్ళి వస్తుంది).

(కు. ఎ. నించి బాదరాయణుడు వస్తాడు)

బా—(కు. ఎ. నించి వస్తూ) జయము జయము ఉదయన రాజా! అంగారవతీ మహాసేనుల పంపున వార్త తెచ్చిన కంచుకి బాదరాయణుడు నమస్కరిస్తున్నాడు.

ఉ—(లేచి) బాదరాయణా! రండి, కూర్చోండి.

బా—చిత్తం. (అని, తనలో) హా విధీ! వీరి రాణిని ఉంచేసి వీరి రాజ్యాన్నే హరించక పోయావా! అని, కూచుంటాడు).

ఉ—మహాసేనరాజు కుశలమా? మహాసేనుడు రాజుల రాజు. అరాజుని రాజుగానూ రాజుని అరాజుగానూ చెయ్య గల సమర్థుడు. ఏమని వారి ఆజ్ఞ ?

బా—ప్రభువువారు కూర్చోండి. ఇదే మహాసేనుల వారి మాటలు: "ఉదయనరాజా! శత్రువుకి చేజిక్కిన మీ రాజ్యం మళ్ళీ మీరు స్వాధీనపరుచుకో కలిగినందుకు

మిమ్మల్ని చాలా అభినందిస్తున్నాను. మీ సత్తా మీరు ఋజువు చేసుకో గలిగినందుకు సంతోషిస్తున్నాను. ఎందు చేతంటే, హృదయ దౌర్బల్యమూ బలహీనతా గలవాళ్ళకి విశేష సామర్థ్యంగాని చైతన్యంగాని ఉండ నేరవు. పైగా, శ్రమా త్యాగమూ లేకుండా రాజవైభవం సిద్ధిస్తుందని కలలుగంటూ కూచుండ కూడదు. శక్తివంచన లేకుండా యత్నిస్తూన్న మీకు దైవం ఇంకా అనుకూలించాలని ప్రార్థిస్తున్నాను.

ఉ—(నమస్కరిస్తూ) యథార్థంగా, ఇదంతా మహాసేనులవారి ఆశీర్వాద ఫలం. ఓడిపోయి సిగ్గుపడి వారి యెదట నేను నిలిచిఉండగా, వారు నన్ను పుత్రుణ్ణిలాగ వాత్సల్యంతో కౌగిలించుకున్నారు. వారి కుమార్తెని నేను దొంగచాటుగా అపహరించి తీసుకు వచ్చాను, ఇప్పుడు బహిరంగంగా అగ్నిపాలు చేసుకున్నాను. ఆమె దుర్మరణం యొక్క ఉదంతం విన్న తరవాత కుడా వారికి నా మీది వాత్సల్యం తరగ లేదు గనక నే, ఇంత గౌరవంతో వారు నాకు సందేశం పంపించారు. కృతజ్ఞుణ్ణి.

బా—మరి రాణిగారి మాటలు వినండి.

ఉ—అంగారవతి రాణి కుశలమా ? ఆమె రాణులరాణి, పదహారు రాణుల్లో పట్టమహిషి, ఉజ్జయినీ నగరానికి అధిష్ఠాన దేవి.

బా—రాణిగారు కుశలం. మీక్షేమమూ మీప్రజల క్షేమమూ అడిగినట్టు చెప్పమన్నారు.

ఉ—అయ్యో! నాప్రజ! 'నాప్రజ' ఏమైందో తెలుసును గదా!

బా—తెలుసు, ప్రభూ, తెలుసు. తమరు మళ్ళీ ఆ దుఃఖంలో పడకండి. ధైర్యం తెచ్చుగుని నిలుపుగోండి. తల్లిదండ్రులకీ మీకూ ఇంతదుఃఖం పెట్టి వాసవదత్తరాణిమాయం అయినా, ఇందరి హృదయాల్లో ఉండడంనించి ఆమె అదృశ్యంగా జీవించేఉంది. ఆసన్నమైన కాలాన్ని ఎవరూ ఆపలేక పోవడం రూఢి. తాడు తెగిపోగానే కలశం నూతులోపడడం తప్పదు. ఒక సూత్రమే మనుషులకైనా చెట్లకైనా—పెరగడం, కాలక్రమంలో నరక బడడం.

ఉ—అయ్యో! మహాసేనరాజు కూతుర్ని మరవగలనా? నాశిష్యురాల్ని, నాప్రియరాణిని, ముందు జన్మల్లోనైనా మరవగలనా? మరణం నన్ను మింగెయ్యవచ్చు, భూమి నీరు కావచ్చు. కాని ఎన్ని శక్తులు ఏకమై నాకు ప్రతికూలంగా పనిచేసినా, నా వాసవదత్త స్మరణని చెరిపివెయ్యలేవు.

బా—మహారాణిగారి సందేశం ఇది: "ఉదయనరాజా! వాసవదత్త ఇక స్వప్నవృత్తాంతంగదా!"......

ఉ—అయ్యో! ఆగండి, బాదరాయణా! క్షమించి! ఆ తల్లి ఎంత యథార్థం సెలవిచ్చారూ, ఎంత యథార్థం

సెలవిచ్చారూ! 'వాసవదత్త ఇక స్వప్నవృత్తాంతం—...' ఆ మాత మాటలు సెలవియ్యండి, బాదరాయణా! మహా ప్రసాదంగా భావిస్తాను.



బా—"నేనూ మహారాజుగారూ మిమ్మల్ని మా పిల్లలైన గోపాలక పాలకుల్ని చూసుకునేటట్టుగానే చూసుకుంటున్నాం. పైగా, ఆనాటించీ మీరే మా అల్లుడవాలని వలలు వేస్తూనేఉన్నాం. ఆ ఉద్దేశంతోటే మిమ్మల్ని బలిమినిపట్టి కోటలోకి తెచ్చించి మా అమ్మాయికి వీణ చెప్పడం మిష కల్పించాం, అగ్నిసాక్షిగా మీ వివాహం జరక్కముందే మేం ఆమెను మీ చేతులోఉంచాం. మరీ తొందరపడి మీరామెను తీసుకు వెళ్ళిపోడంవల్ల, లాంఛనపూర్వకంగా జరగవలిసిన వివాహకాండ జరగనేలేదు. అప్పుడు మేం మీ యిద్దరి చిత్రాలూ వెయించి, ఆచిత్రాల్ని సరసనిఉంచి, పెళ్ళితంతు జరిపించాం. ఈ రాయబారిద్వారా ఆ చిత్రాల్ని పంపించాం. అవి చూసుకునేనా మీరు కొంత మనశ్శాంతి తెచ్చుగోండి."(అని చిత్రపటాలు ఇస్తాడు.)

ఉ—ఇల్లాంటి సందేశం పంపిన ఆ మహారాణికి వందనాలు. ఆమె చిత్రపటం వంద సింహాసనాలకంటె పైమాట. (అని వాసవదత్త చిత్రం కళ్ళకి అద్దుకుంటాడు.)

ప—ఏది ఆమె చిత్రపటం! (అని పుచ్చుకుని, దాన్ని పరికించి, కుతూహలంతో సూక్ష్మపరీక్షచేసి) అరె! జలజ

పోలికగా ఉందే, ఇందులో పెళ్ళికూతురూ! ప్రభూ! ఈ చిత్రంకేసి నిదానించి చూసిచెప్పండి—ఇది అచ్ఛంగా వాసవదత్తరాణిగారి పోలికేనా?

ఉ—దీన్ని ఆమెపోలిక అంటే చాలదు, పద్మావతీ! ఇది కేవలం ఆవిడే అనికూడా అనవచ్చు. అయ్యో! ఇటువంటి లక్షణాలు గల ముఖం అగ్నిపాలవడం ఎంతఘోరం!

ప—(రాజుపటంకేసీ రాజుకేసీ పరకాయించి చూస్తూ) ప్రభువువారి చిత్రం అచ్ఛంగా ప్రభువువారిలాగే ఉందికదా! అటువంటప్పుడు వాసవదత్తరాణి చిత్రంకూడా అచ్ఛంగా ఆవిడలాగే ఉందన్నమాట! కాని, ఈ లక్షణాలే అచ్ఛంగా జలజకి ఉన్నాయి. జలజే వాసవదత్తరాణేమో! ఎంత ఆనందం! కాని, ఎంతచిక్కు?

ఉ—అదేమిటి పద్మావతీ! చిత్రపటాన్ని అదే చూపు చూసి అల్లా చికాకు పడుతున్నావేం?

ప—అచ్ఛంగా వాసవదత్త రాణిలాంటి ఆవిడ ఒకర్తె ఇక్కడుంది, నాతో. ఒక తపస్వి ఆవిణ్ణి తీసుగొచ్చి నాకు అప్పగించాడు, రాజగృహాశ్రమంలో. ఈవిడ ఆయన సోదరిట. ఈవిడకి పెళ్ళి అయిందిట. మళ్ళీ వచ్చి తను తీసుగుని వెళ్ళిందాకా, ఈవిణ్ణి నేను కనిపెడుతూ ఉండాలని కోరుకున్నాడు. ఈవిడ పేరు జలజ.

ఉ—అయితే, ఆ జలజని త్వరగా రప్పించు.

ప—నేనే వెళ్ళి తీసుకు వస్తాను. (అని ఎ. మ కి వెళ్తుంది.)

(కు. ఎ. నించి 'మహాప్రభూ' అని కేక వినపడుతుంది.)

ఉ—మల్లికా! ఎవరో చూడు. ఈ మందిరం వరకూ వచ్చారు!

మ—(కు. ఎ. కి వెడుతుంది:)

ఉ—(ఇటూ అటూ ఆందోళనతో తిరుగుతూ) అంత అదృష్టం ఎల్లా కలిసొస్తుందీ? మనిషిని పోలిన మనిషి ఉండవచ్చు. ఇంకా వాసవదత్త ఎక్కడుంటుందీ? ఎవరో జలజ వాసవదత్తే అయ్యుండడం అసంభవం. ఇదేదో భ్రాంతి, లేని పోని ఆశ.

మ—(కు. ఎ. నించి వస్తూ) ప్రభూ! ఎవరో తపస్వి! ఉజ్జయినిట, తన సోదరి ఉందిట, పద్మావతీ రాణితో మాట్లాడతారట.

ఉ—రమ్మను.

మ—(కు. ఎ. జరిగి రమ్మన్నట్టు సగౌరవంగా సంజ్ఞ చేస్తుంది.)

యా—(కు. ఎ. నించి తపసి వేషంలో వస్తూ, తనలో) నేను యాంత్రా ప్రభువు మేలుకోసమే చేసినా, స్వతంత్రించి నే సీ నాటకం జరిగించడం గురించి, ప్రభువు ఏమంటారో! (పైకి) జయము జయము మహాప్రభూ!

ఉ—(తనలో) ఈ గొంతిగ విన్న గొంతిగలానే ఉందే! కాపి. ఎవరో! (పైకి) రండి, మహాత్మా! దయచెయ్యండి. తమ సోదరి కోసమూ వచ్చారు?

యా—చిత్తం, ప్రభూ!

[ఎ. మ. నించి పద్మావతి, జలజా వస్తారు]

ప—(ఎ. మ నించి వస్తూ) ఇదుగోనండి జలజ!

ఉ—ఆ బాదరాయణుడు సాక్షిగా, ఈవిణ్ణి ఆ తపస్వికి అప్పగించు, పద్మావతీ!

ప—ఓ తపస్వీ! ఇదుగో మీ సోదరి, జలజ.

శా—(నవ్వు ముఖంతో) ఈవిడ జలజేమిటీ, వాసవదత్తే!

ఉ—(అతి కంగారుతో) ఈవిడా! మహాసేనరాజు కూతురా? అయితే. ముందు, లోపలికి తీసికెళ్ళండి.

యా—మహాప్రభూ! తమరు భరతవంశజులు, నిష్కళంకులు, పండితులు, గుణవంతులు. ముందు ఆమెని అప్ప

గించేస్తామని, ఇప్పుడు మాట తిరిగిపోకండి. బలిమిని ఆవిణ్ణి తీసుగోకండి, అది రాజత్వం కాదు.

ఉ—సరే సరే. ఆ సంగతి నిదానంగా పరిష్కరించుదాం లెండి. అసలు ఈమె ఎవరూ అని? ఎట్లా అవుతుంది వాసవదత్తా?

వా—(ముసుగు తొలగించేసి) ఇట్లా! జయము జయము మహారాజా! ఎన్ని జన్మలకీ మీ ధర్మపత్నిని. కాని, ఈ జీవిత శేషానికి ఈ వేషంలో ఉండనీండి.

ఉ—ఓరి దేవుడా! ఈమె వాసవదత్తే! మహాసేన కుమారి!

బా—మహాప్రభూ! ఈ తపస్వి యౌగంధరాయణులే!

యౌ—(వేషం తీసేసి నమస్కరిస్తాడు)

ఉ—ఔర! ఈయన నా మంత్రి యౌగంధరాయణుడేనా! నేను మళ్ళీ కలలో పడ్డానా, యథార్థ ప్రపంచంలో ఉన్నానా? (మళ్ళీ వాసవదత్తని పరీక్షగా చూసి) సందేహం లేదు. (అని, ఆమెని ముట్టుగుని) ఈమె నా ప్రియ భార్య, వాసవదత్తే! పోయిందనుకుని, నేను కుడా మరణించి ఈమెని కలుసుగోవా లనుకున్నాను. నేను ఈ శరీరం చాలించకుండానే, ఈ జీవితంలోనే ఈవిణ్ణి సశరీరంగా నాకు భగవంతుడు మళ్ళీ ఇచ్చాడు—పద్మావతిద్వారా!

ప—కాదు, మహాప్రభూ! నేను వచ్చాను మీకు — ఆమె ద్వారా!

యౌ—(ఉదయనరాజు పాదాలవద్ద మోకరించి) మహా ప్రభూ! రాణిని మాటు పరిచి నేను మహాపరాధం చేశాను. నన్ను క్షమించండి.

ఉ—(ఆయన్ని లేవనెత్తి) మిమ్మల్ని నేనా క్షమించడం, నన్ను మీరా? పిచ్చినటించీ నేర్పుతో పన్నాగాలు పన్ని నేనూ రాజ్యమూ నాశనం కాబోతూంటే అడ్డి నన్ను ఉద్ధరించిన మహోదారులు మీరు! (అని. తన మెళ్ళోని హారం తీసి మంత్రి మెడలో వేస్తాడు.)

యౌ—(వాసవదత్తకి మొక్కి) మహారాణీ! నేను మిమ్మల్ని పెట్టిన బాధలకీ, మీకు కలిగించిన మనః క్షోభకీ నన్ను క్షమించండి.

వా—ఎంతమాట అమాత్యా! మీ రెంతెంత బాధలు పడ్డారో నాకు తెలియదా? మీవంటి ఆంతరంగికులూ రాజ్య క్షేమాభిలాషులూ మంత్రులుగా ఉండడం మా అదృష్టం. మేం ఏంజేసీ మీ ఋణం తీర్చుగోలేం.

యౌ—నా విధి నిర్వహించాను, ఆ విధి అనుకూలించాడు. అంతే, తల్లీ!

ప—(వాసవదత్త పాదాలకి మొక్కి) మహారాణీ! సాధారణమైన ఒక ఇల్లాలుగా మిమ్మల్ని గణించి, నేను, గ్రహింపులేక, మీ యెడల చాలా అనుచితంగా వర్తించాను. తలవంచి మీ క్షమాపణ వేడుకుంటున్నాను మీ త్యాగ బుద్ధికి దాసోహం,

వా—(పద్మావతిని లేవనెత్తుతూ) లేవమ్మా! క్షమలాంగీ! నువ్విట్లా నాకు సాష్టాంగ నమస్కారం చెయ్యడం ఒకటీ తప్ప నీ వల్ల మరో తప్పు ఏమీ లేదు.

ఉ—అమాత్యా! వాసవదత్త రాణిని మాటుపరచడంలో మీ అభిప్రాయం ఏమిటీ?

యౌ—తమకు తెలియని దేముంది, ప్రభూ! మీకూ దర్శకరాజుకీ బాంధవ్యం చేకూరడానికి వీలుకలిగే నిమిత్తమే!

ఉ—ఓహో! సరి. వాసవదత్తని తీసిగెళ్ళి పద్మావతి రక్షణలో ఉంచారేం?

యౌ—జ్యోతిష్కులైన పుష్పకాదులు, పద్మావతీదేవి తమకు రాణికాగలరని జోశ్యం చెప్పడంవల్ల.

ఉ—రుమణ్వంతుడికి కూడా ఈ ఎత్తు తెలుసునా?

యౌ—తెలుసును, మహాప్రభూ!

ఉ—అబ్బా! ఆయన నా సమక్షంలోనే ఉండవలిసొచ్చి ఎంత నటిస్తూ ఎంతబాధపడ్డారూ నాకోసమూ? వారిని పిలుద్దాం. మరి, ఆ భోజన ప్రియుడికి?

యౌ—వసంతకుడికీ తెలుసును, ప్రభూ!

ఉ—తెలుసునా? వసంతకుణ్ణి రానీండి చెబుతాను.

వ—(కు. మ. నించి వస్తూ) వచ్చాను, మహాప్రభూ! తమ శిక్షకి బద్ధుణ్ణి.

ప—శిక్ష మరేమీ లేదండి, వసంతకా! మరో మిఠాయి పళ్ళెం నేను కూడా పంపిస్తూంటాను.

వ—పంపితేచాలు మాత్రం భయపడతా ననుకున్నారా! పంపండి. మళ్ళీ మాట్లాడకుండా నోరుమూసుకుని మీ శిక్ష పూర్తిగా అనుభవిస్తాను.

యా—మహాప్రభూ! ఈ బాదరాయణుడు ఉజ్జయిని వెళ్ళిపోవడానికి అనుజ్ఞ ఇయ్యండి. వాసవదత్త రాణి క్షేమంగా ఉన్నట్టు తల్లి దండ్రులికి తెలియడం మహానందం కదా!

ఉ—అట్లా కాదు. అక్కడికి మనం అంతా కలిసే వెడదాం—పద్మావతీ రాణితో సహా! ఇంతవరకు ధన్యులం!

( తెర )

